సూర్యనారాయణశర్మ, గాడేపల్లి

భారత స్వరాజ్యయుద్ధము

రాజమండ్రి, 1928

Record no. 774

సూర్యనారాయణశర్మ, గాడేపల్లి, b. 1889.
భారత స్వరాజ్యయుద్ధము / గ్రంథకర్త గాడేపల్లి సూర్యనారాయణశర్మగారు; సంపాదకుడు ముదిగంటి జగ్గన్నశాస్త్రి.- 1. కూర్పు.- రాజమండ్రి : జగపతి ముద్రాక్షరశాల, 1928.

139, ii, 3 p. ;18 cm.
Record no. 774

Sūryanārāyaṇaśarma, Gāḍēpalli, b. 1889.
Bhārata svarājyayuddamu / granthakarta Gāḍēpalli Sūryanārāyaṇaśarmagāru; sampādakuḍu Mudigaṇṭi Jaggannaśāstri.- 1. kūrpu.- Rājamaṇḍri : Jagapati Mudrākṣaraśāla, 1928.
139, ii, 3 p. ;18 cm.
Record no. 774

పల్లెటూరు గ్రంథమండలి
9-10 వ పుస్తకము.




సంపాదకుడు.
ముదిగంటి జగ్గన్నశాస్త్రి, బి. ఏ.



# భారతస్వరాజ్యయుద్ధము



మొదటికూర్పు 1000 ప్రతులు.

గ్రంథకర్త.
గాడేపల్లి సూర్యనారాయణ శర్మగారు
రాజమండ్రి.

1928.

## పల్లెటూరు గ్రంథమండలి

రా జ మం డ్రి.



సంవత్సరమునకు ఆరు పుస్తకములు.

చందా 1—0—0 మాత్రము.

వెలువడిన పుస్తకములు.

1. గాంధి మహాత్ముని నీతిమంజ్జరి.
2. రాజనీతి సారము.
3. ప్రాచీన భారత గ్రామ పరిపాలన 1.
4. రామతీర్థస్వామి జీవితము.
5. బ్రహ్మజ్ఞానోద్బోధనలు. I. II.
6. కర్మయోగియొక్క ఆదర్శము.
7. రామతీర్థస్వామి బ్రహ్మజ్ఞానోద్బోధనలు. III.
8. బ్రహ్మజ్ఞానోద్బోధనలు. IV.



వినాయక సావర్కారు జీవితము (ప్రత్యేకము) వెల 0-12-0

'పల్లెటూరు గ్రంథమండలి'




సంపాదకుడు.

ముదుగంటి జగ్గన్న శాస్త్రి, బి. ఏ.

# భారతస్వరాజ్యయుద్ధము



మొదటికూర్పు 1000 ప్రతులు.

గ్రంథకర్త.

గాడేపల్లి సూర్యనారాయణ శర్మగారు,

రాజమండ్రి.

1928.

సర్వస్వామ్య సంకలితము.

రాజమండ్రి
గపతి ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1928.

# పీఠిక

ఏప్రజాసంస్థ మాతృదేశదాస్యవిముక్తికి 42 వత్సరములనుండి పాటుబడుచున్నదో, ఆదేశీయమహాసభయొక్క చరిత్రమునంతను హృద్యముగ నామిత్రులగు శ్రీయుత గాడేపల్లి సూర్యనారాయణశర్మగారు యీగ్రంథమునందు వర్ణించియున్నారు. ఈమహాగ్రంథము నామూలాగ్రముగ చదువు పాఠకులెల్లరు నియ్యది నీచమైన బానిసత్వమున మలమలమాడుచున్న భారతీయుల స్వాతంత్ర్య సమరముయొక్క సంగ్రహ చరిత్రమని తెలిసికొనగలరు.

ఈ గ్రంథకర్త వచోనిపుణుడే గాక ప్రస్తుతమాంధ్రదేశమునగల కొలదిమంది సుప్రసిద్ధ గ్రంథకర్తలలో నొకడనియు, గాఢనిద్రయందున్న బానిసలను మేల్కొల్పదగిన జాతీయవాదియనియు గ్రంథమే వేనోళ్ళజాటుచున్నది. 'జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల,' యనునట్లు యీమహనీయుని రచనామృతమును గ్రోలుచున్న ఆంధ్ర సోదరుల కీగ్రంథప్రాశస్త్యముంగూర్చి నేనధికము వ్రాయుట చర్వితచర్వణమే యగునని విన్నవించుచున్నాను.

శ్రీవత్సవాయి రాయజగపతివర్మ.

ఆంధ్రరాష్ట్ర పత్రికాధిపతి.

20—1—28.

# చందాదారులకు విజ్ఞప్తి

ఈసంవత్సరము తాలూకు పుస్తకము లిదివరలో రెండు వెలువడినవి. చాలమంది పుస్తకముల సైజు చాలచిన్నదిగానుండుటచే లైబ్రరీలలో నుంచుకొనుటకు వీలుగాలేదని సూచించుటచే సైజు మార్చితిమి. ఒక్కొకవిషయము చాలపెద్దదిగా నుండుటచేతను రెండు వేర్వేరుభాగములుగా విభజించుటకు వీలుగా కుండ నుండుటచేతను ఒకేభాగముగా ముద్రించవలసివచ్చుచున్నది. వెనుకటి వత్సరములో నొకపుస్తకమునిట్లే రెండు వాల్యూములక్రింద భావించుకొంటిమి. ఈపుస్తకమునుకూడ రెండువాల్యూములుగ భావింపగోరుచున్నాను. ఈవత్సరముకిక రెండుపుస్తకములు వెలువడును.

ముదిగంటి జగ్గన్న శాస్త్రి

---

ఓమ్



# భారత స్వరాజ్యయుద్ధము

## భూమిక

"అగ్రేవ్యాధః కరధృతధనుః పార్శ్వయోర్జాలమాలా।
పృష్ఠేవహ్నిర్దహతివిపినమ్ ప్రేరితస్సారమేయః।
ఏణీగర్భా దలసగమనా డింభకైర్లగ్నపాదా।
లక్ష్మీనాథస్త్వమసిశరణం! కింకరోమి? క్వయామి?॥"

"త్రింశత్కోటి ప్రజాకీర్ణాం నదీనదసమావృతాం।
సర్వసస్య సమృద్ధాంతాం వందేహం దేశమాతరం॥"

తల్లీ! నమస్కార పరంపరలు! నీయిప్పటి దురవస్థవర్ణనాతీతము. ముప్పదిమూడుకోట్ల ప్రజలుగల నీవు దిక్కుమాలిన దాస్యశృంఖలాబద్ధవైపడియుండుట మూడులోకముల కబ్బురమంగొల్పుచున్నది. నదులు, పర్వతములు మహారణ్యములు సమస్తఖనిజములు, లోహములు, సేద్యభూమి, సకాల

వర్షములు, పుష్కలమగు పంటలు గలిగియుండియు నేటికి నీబిడ్డలలో నారుకోట్లమంది కొక్కపూటయైన గంజిదొరకని దుర్భర గర్భదారిద్ర్య దేవత నిన్నలముకొనియుండుటచూచి దేవతలు సహితము నిర్భరాశ్చర్యము నొందుచున్నారు. ఆజనన మరణాంతము రోగములెఱుంగక దీర్ఘాయుష్మంతులై జీవించుట కలవాటుపడిన నీప్రజలు నేఁడు చిత్రవిచిత్ర రోగములవాతబడి యల్పాయుష్కులై మొత్తపు పరమాయువు యిరువది రెండు సంవత్సరములకంటె నెక్కుడు లేకుండ నల్లాడుచుండుటకు గతంబేమియో దురూహ్యముగనేయున్నది. వేలకొలంది సంవత్సరములు భూగోళమునకంతకు సమస్తవస్తుజాలము సమర్పించిన వాణిజ్యవైభవ మనుభవించిన నీవునేఁడు పరదేశములపై బూతికపుల్లకుగూడ నాధారపడి యుండవలసిన దుర్గతి యెట్లుతటస్థించినది? నీఢక్కా మజిలీసులేమైనవి? నీయుద్ధనౌకలెక్కడడంగినవి? నీతాజ్మహాలు శిల్పచాతురి యెట్లంతరించినది? నీప్రజాస్వామిక ప్రధాన పరిపాలనావిధానము లెట్లుద్రుంగినవి? నీయాధ్యాత్మిక విద్యారహస్య పరిశోధనా ధురీణులగు ఋషీశ్వరులేమైరి? నీనాగరికత, నీనైతికధర్మప్రతిష్ఠ, నీసర్వమతసహిష్ణుత, నీయుదారత, నిర్భీకత, నీమానాభిమాన ప్రేమాణములేమైనవి? జగదేకవీరులఁగన్న తల్లీ! యిట్లొరుల పంచల నూడిగమొనరు, కొఱటకు నర్హవుగాక యిరుగుపొరుగుల,



నగుబాట్లకు పాలగుటకేమిటి కారణము? మహీమండలాఖండలురగు సార్వభౌములు చక్రవర్తులు, మహారాజులు పోయి నేటికి నీగర్భవాసమున మాబోటి నిర్భాగ్యులు పిరికిపందలు పరప్రత్యయనీయులు స్వార్థపరులు మూఢులు జనించుట కీవెట్టి పాపమొనర్చుకొంటివి తల్లీ! జలప్రళయము మొదలు నేటివరకు సుమారు పదివేల సంవత్సరములనుండి యార్యమిత్రులు నీయొడిలోఁబెరిగి స్వచ్ఛంద విహారపారీణులై స్వారాజ్యమనుభవించి యనేక భోగభాగ్యముల చూఱగొని యనేకరాజ్యముల నాక్రమించి యనేకధర్మముల బ్రతిష్ఠించి సమస్తశాస్త్ర తత్వముల బరిశీలించి బహువిధముల లోకమునకంతకును నాయకమణులై విరాజిల్లియుండిరి కదమ్మా! అట్టిఘనానుభవ మెందుల కెట్లంతరించినది? నామరూపములుకూడ నశించిపోవుటకు బుట్టినమహత్తర కారణమెట్టిది? ఇంతటిదీనతరావస్థ యెన్నినాళ్ళకు సంఘటిల్లినది? ఈయేలినాటి శనిపాడ వెంత? నీసుతులింతకాలమును దూష్ణీంభావులై యూరకుండిరా ప్రతిఘటించిరా? నీయావచ్ఛక్తి వినియోగించి నీబిడ్డల నెప్పటికప్పుడు పురికొల్పి పురుషకార మొనర్పించితివా లేదా? అమ్మా యిది యంతయు దైవికమేనా? నీబిడ్డలస్వయంకృతాపరాధమేమైన నున్నదా? ఈసంప్రశ్నల కేతావులేకుండ నీప్రత్యుత్తరములు వినుటకే మతిలేకుండ దుర్భరదాస్య వ్యామోహపాశముల

మైమఱచి గాఢనిద్రల మునింగిన మమ్మెట్లు మేలుకొల్పెదవు? ఆఱువేలమైళ్ళ దూరమునుండి యేతెంచిన యైదార్గుర దొరల, కైవసమొనర్పబడి యంతమందిచేతనే నేటివఱకు నీవుపరిపాలింప బడుచుండుట నీబిడ్డల యలసత్వముచేతనా వారి తెలివితేటలవలననా? ఇంతకు నీస్వరాజ్యలక్ష్మి యెప్పుడెట్లుపోయినది? నీకుజాతీయతయే యింతవఱకు లేదని పాశ్చాత్యులనుచున్నారు నిజమేనా? నీవెల్లప్పుడు మానుషాశనులకంటె నిరంకుశులగు ప్రభువులచే మాత్రమే పాలింపబడుచు వచ్చితివనియు బ్రజాస్వామికమన నేమోధర్మమన నెట్టిదో నీవెఱుంగవని యాంగ్లేయు లంగలార్చుచున్నారు. నీకు బూర్వచరిత్రయే లేదనుచున్నారు. నీవు మూఢమతాభినివేశములపాలై నేటి కాంగ్లేయులవలన నాగరికత నేర్చుకొనుచున్నావని చాటుచున్నారు. ఇందలి యథార్థమేమిటి? తల్లీ యీవిషయముల నీవెఱింగిన సత్యముల నీబిడ్డల కెఱింగించినగాని మాలోగల యీ యలసత్వము మైకమునశించి తేటతెల్లమగు దేశభక్తి త్యాగశీలము విధినిర్వహణాదికముయుఁ బురికొల్పబడజాలవు! అగ్రభాగమున ధనుష్పాణియై బాణము గురి చూచుచున్న కిరాతుడుండ నిరుపార్శ్వముల బాఱిపోకుండ వలలుబన్నబడియుండ వెనుకభాగమున దవానలము ఛటచ్ఛటారావముతో వెన్దరుముచుండ బురికొల్పబడిన వేటకుక్కలు తనపై నుఱుకుచుండ!



నోటెఱుఁగని పసిపిల్లలు కాళ్ళకుజుట్టుకొని గీరుగాయుమని యేడ్చుచుండ, నిండుచూలాలైన యాడులేడి దురవస్థయే నీకును నేడు సంఘటిల్లినదని తజ్ఞులూహించి వేసారుచున్నారు. అనుగ్రహించినచో నాయోపినంత వట్టుపై సంప్రశ్నముల యితివృత్తములోని సత్యము నివేదించుకొందును. సోదరులు నా యవజ్ఞత కాగ్రహింపక గుణగ్రహణ పారీణులై యిందుగల నిజానిజముల నిర్ణయింతురుగాక!



## ప్రాచీనస్వరాజ్యతత్త్వము

భూగోళమునందు నేటివఱకు నిలిచిన నాగరికతలలో నత్యంతప్రాచీనమైన దేదియని విశేషవిమర్శనా పరిశోధనల నొనర్చి తుదకు బాశ్చాత్యులలోని ప్రముఖులే వేదనాగరికతయే యత్యంత ప్రాచీనమైనదని నిర్ణయించిరి. ఈవేదముల మన హైందవుల పౌరుషేయములు ననాదులునని నమ్ముచున్నారు. పాశ్చాత్యులు మాత్రము వారి క్రైస్తవమత గ్రంథములోని సృష్టికాలనిర్వచనము ననుసరించి యొక యైదువేల సంవత్సరములకు బూర్వమునకు దమదృష్టి ప్రసరించుకొనజాలక వేదములు సహిత ముత్పత్తి కాలనిర్ణయమునందే బంధింపజా[illegible]

డివారు. కానివారిలో నిప్పుడిప్పుడభివృద్ధి గాంచుచున్న భూగర్భతత్వశాస్త్రవేత్తలు కొందరుబయల్దేరి పలుతావుల దమగాఢపరిశోధనము లాచరించి బైబిలులోని సృష్టికాల నిర్ణయము అజ్ఞానకృతమని యనేక ప్రత్యక్ష ప్రమాణములతో ధృవపఱచియున్నారు- వారిపరిశోధనా పర్యవసానముగ నుత్తరధృవమండలమున మునుముందు జనులు నివసించుచుండెడివారనియు నాప్రాంతము లిప్పటివలె నత్యంతశీతలాకీర్ణములుకాక సమశీతోష్ణతలతో విరాజిల్లుచుండెడివనియు నక్కడ ప్రజలప్పుడు సంపూర్ణనాగరికతా వైభవము నంపాదించుకొనగల్గిరనియు నట్టిపరిస్థితులిప్పటికి గొన్నివేల సంవత్సరములకు బూర్వమైయుండ తీరవలెననియు నిర్వచించుచు నప్పుడుసంభవిల్లిన జలప్రళయమున నాప్రాంతము జలాకీర్ణమై భూగోళమొకించుకయొఱిగి శీతోష్ణవిభేదములుగల్గిన ప్రదేశములు ప్రభవిల్లినవనియు నటుతరువాతనే యార్యులనబడువారు పూర్వనాగరికతా విపాకముల సేకరించుకొని పలుమొగంబులబ్రాకి యిప్పటి భూగోళమంతయు నాక్రమింప జొచ్చిరనియు బ్రత్యక్షానుమానప్రమాణములతో ఋజువుచేసియున్నారు.

ఇట్టితెరి లోకమాన్య బిరుదాంకుడగు భగవాను బాలగంగాధర తిలకమహాశయుడు విశేషపరిశోధనము లొనర్చి పై భూగర్భతత్వవేత్తల నిర్వచనములకు నప్పటి యార్యగ్రంధరా



జములని పేరెన్నికగాంచిన వేదములనుండి యనేకఋక్కుల సంగ్రహించి యీవేదమంత్రద్రష్టలాయుత్తర ధృవమండల నైసర్గికవైచిత్ర్యములెఱింగినవారై యున్నారనియు ఆర్యులుపూర్వపూమేరు ప్రదేశములనుండి జలప్రళయానంతరము దక్షిణప్రాంతములగు పారశీకము భరతఖండము పాశ్చాత్యదేశము తండోపతండములుగ బ్రాకి యులముకొని తేజరిల్లిరనియు దృష్టాంతపూర్వకముగ ఋజువుచేయగల్గినాడు- మఱియు నాభగవానుడే వేదగ్రంధముల కాలనిర్ణయ మత్యద్భుతముగ పాశ్చాత్యభూగర్భ తత్వవేత్తల నిర్ణయపూర్వక సృష్టికాలనిర్ణయముతో సరిపోవుచున్నదని జ్యోతిషమార్గానుగామియై బలపఱచియున్నాడు.

ఋగ్వేదాంతర్గతమైన యైతరీయ బ్రాహ్మణమందు సప్తఋషి మండలము మృగశిరా నక్షత్రమునకు సూటిగ నున్నదని యభివర్ణింపబడి యున్నదనియు వేయివత్సరములకొక నక్షత్రము మాత్రము దాటగల్గిన సప్తఋషిమండలము నేటికి హస్తానక్షత్రమునకు సూటిగనున్నదనియు నందుచే నెనిమిది వేల సంవత్సరములైననిప్పటికి జరిగియుండవలసినదనియు మొదలగు వైదికజ్యోతిష వాక్యములతో వేదకాలప్రాచీనత నేటికి పదివేల సంవత్సరములైన కాక తప్పదని ధృవపఱచియున్నాడు. ఈమహాశయుని సమర్ధనమే పాశ్చాత్య దేశములందుగలప్రా

చీన చారిత్ర పరిశోధకు లెల్లరు శిరసావహించి వేనోళ్లం బొగిడియున్నారు. ఇందులకు వ్యతిరేకులై క్రైస్తవమత మూఢవిశ్వాసులగు కొందఱుమాత్రమే ప్రాల్మాలుచున్నారుకాని భౌతికశాస్త్రములతో సత్యాన్వేషణాపరాయణులగు నెల్లరు విశ్వసించి యంగీకరించియున్నారు. ఇట్టినిర్ధారిత ప్రాచీనతాగరిమగల వేదములకు నేటివరకుం బట్టుగొమ్మయైన హైందవజాతియొక్క ప్రాచీనతగురించి సంశయించుట మూర్ఖత్వమే యనిపించుకొనక మానదు.

కావున నిర్వివాదముగ హైందవజాతి పదివేల సంవత్సరము లనాగరికత యనుభవించుచున్నదనుటలో నతిశయోక్తి యావంతయులేదు. ఇట్టి హైందవనాగరికతా విజృంభణ సమయమగు పదివేల సంవత్సరములకు బూర్వము మనలనిప్పుడు పాలించి గర్వించుచున్న యాంగ్లేయుల బ్రిటిషుదీవులు జలగర్భమునుండి బైటబడినవో లేదో? బయటబడినవన్నను అందలి ప్రజలు గుడ్డకట్టుకొనుట, కూడువండుకొనుట యొకచోగూడి పలువురు వసగల్గుటకూడ, నెఱుంగరని వారిపూర్వచరిత్రలే వేనోళ్ళచాటుచున్నవి. ఇట్టి బ్రిటిషువారు నేడు హైందవు లనాగరికులనియు వీరికిదాము నాగరికత నేర్పుచున్నామని యనుకొనుట యెంతటియజ్ఞానమో యహంభావమో వేఱచెప్పనక్కఱలేదు.



ఇంతటి ప్రాచీనతగల వేదకాలమునందు బ్రజలెట్లుండిరో వారిరాజ్యాంగ విధానమేమిటో కొంతవిమర్శించుకొనవలసియున్నది. సకాలవర్షములు సస్యసమృద్ధి మానవప్రయోజక వస్తునిర్మాణ కౌశలము ధర్మప్రవృద్ధి భగవద్భక్తి తత్పరత్వము నైతికశీలము, మతాన్యోన్యసహనము మొదలగు సద్గుణరాజములన్నియు వేదకాలమందే ప్రభవిల్లియున్నవని యనేకదృష్టాంతములు చూపవచ్చును. ముప్పదిమూడుకోట్ల దేవతలుగా బరిగణింపబడుచు వచ్చిన ముప్పదిమూడుకోట్ల ప్రజలప్పుడు నుండెడివారనుకొనదగును. ఇప్పటికిని దురవగాహములగు వేదాంత తత్వరహస్యముల నిర్వచింపగల్గిన యాకాలము ఆర్థికసమృద్ధితో వర్ధిల్లినదనుటలో నాశ్చర్యములేదు. అప్పటికే ప్రస్తరింపబడిన చాతుర్వర్ణ్య విభాగములోని చమత్కారము సౌకర్యము నప్పటి జాతీయసౌష్టవమును ఋజువుచేయగలవు. అప్పటియార్యజాతిలో నాముష్మిక జ్ఞానతేజఃపుంజముతో బ్రకాశింపగల్గిన కొందఱు మహాశయులుండుటచేతనే బ్రాహ్మణులను నొకవర్ణవిభాగమున కవకాశము చిక్కినది. జగదేకవీరులై క్షాత్రధర్మప్రధానులై త్రిజగత్పరిపాలనాకుశలురగు కొందఱుధీరులాజాతిలో నప్పటికే వర్ధిల్లుటచేత క్షత్రియులను నొకవర్ణమేర్పడవలసి వచ్చినది. బహుదేశగమనాగమనప్రతిష్ఠులై విరళవాణిజ్యనిర్వహణ ధురీణులగు కొందఱునిప్పు

ణులుండుటవలననే వైశ్యవర్ణ విభాగమున కాకాలమున విధి యే
ర్పడినది. ఇట్లే మానవ ప్రయోజనకరమైన సమస్తవస్తు నిర్మా
ణకౌశల్యములగు జనములప్పటికే దేశమునందు బ్రభవిల్లియుం
డుటచే మూడవవర్ణమునందుగల వివిధాంతర్విభాగములు పొడ
సూపినవి. ఇట్లు సాంగోపాంగమైన వర్ణవివక్షత, ప్రజాస్వామిక
పరిపాలనా విధానమునకు మూలబీజమని మనము సూక్ష్మ
ముగ గ్రహింపవచ్చును. ఈవర్ణములు నాలుగు, దేశసౌభాగ్య
సౌష్టవములకు సమానాధారములు సమానాది కార్యములు
గూడనై యున్నవి. ఇందేవర్ణమధఃపతన మొందినను మిగత
మూడు నశింపవలసినదే! దేశసౌభాగ్యము సౌష్టవముగ జరుగు
టకే యీ నాల్గువర్ణములను నాల్గుసంస్థలుగ నన్యోన్యాధార
ములై యుండునట్లును స్వీయపరిపాలనమునందు నాల్గు నొ
క్కధర్మము నాశ్రయించి స్వతంత్రములై వర్ధిల్లుటకును వేద
కాలమున సృష్టింపబడినవి. సత్యంవద, ధర్మంచర మొదలగు
ధర్మసూత్రములన్నియు నాల్గువర్ణములకు సమానాచరితవ్య
ములే! నాలుగువర్ణములకు నొకే భగవంతుడు ఒక్కవిధముల
గు పుణ్యపాపములు, నరకస్వర్గములు, మంచిచెడ్డలు ప్రవర్తిం
చుచుండెడివి. భగవద్భక్తి కందఱు సమానాధికారముకలవా
రే! ఈనాల్గువర్ణములు తమలోదాము కొన్నికట్టుబాట్లు
ఒనరించుకొని తమ లో పెద్దల పురస్కరించుకొని



వ్యభిచారాదులకు శిక్షాధిక ప్రాయశ్చిత్తముల
నొందుట యాచారమైయున్నది. వీరి వీరి స్వధర్మముల నిర్వ
హించుకొను విధియు వ్యతిరేకించిన వారి శిక్షించుకొను నధి
కారమును ఈ నాల్గువర్ణములలోని పెద్దలకును గలదు. ఇట్టి
స్వపరిపాలనా దక్షములైన నాల్గుసంస్థలును ఒక్క వేదమునకు
వేదాంగములకు లొంగి మెలంగవలసినదే! ఈసంస్థలు ప్రధా
నముగ తమ సాంఘిక నైతికములే యైనను రాజకీయమునం
దు సంపర్కములేనివికావు. ప్రతిగ్రామమును పట్టణమును తు
దకు రాజధానియు నీనాల్గుసంస్థలవలననే పరిపాలింపఁబడుచువచ్చి
నవి. పల్లెగ్రామము సహిత మీనాల్గు సంస్థలతో స్వతంత్ర
మువహించి మత, నైతిక, సాంఘిక, రాజకీయములందు సం
పూర్ణాధికారము చెలాయించుకొనుచుండెడిది. కర్షకుడు తన
భూమికి సంపూర్ణాధికారి రాజు ఆతని పంటనుండి యొకవంతు
మాత్రమే గ్రహించి యాతనికి జోరులవలన క్రూరమృగము
లవలన బాధరాకుండ దన సైన్యసహాయమున సంరక్షింపవల
సిన బాధ్యత కలిగియున్నాడు. వణిజుడు శిల్పి, యితరవృత్తి
దారులు ఎల్లరు నిట్లే సంపూర్ణస్వేచ్ఛకలవారై స్వీయవిషయ
ముల దమలోదామె నిశ్చయించుకొను స్వతంత్ర మనుభవిం
చుచు తమయాదాయములనుండి కొంతభాగము మాత్రమే
రాజునకిచ్చి యాతనివలన నన్యులనుండి రక్షణ బడయుచుండె

డివారు. రాజునకు నిగళబంధములైన ధర్మశాస్త్రములు ఆత
ని విధినిషేధముల నిర్వచించుటకెల్లప్పుడు సంసిద్ధములుగ
నుండును. రాజెప్పుడును దనయిష్టమువచ్చిన ధర్మమును న్యా
యమును నిర్ణయింప నధికారము కలిగియుండలేదు. ఈరాజు
ను దొలగించుటకీనాల్గును బరిపూర్ణాధికారము కల్గియున్నది.
ఇట్టి రాజులనేకులకుపైనుండి కప్పముగొని చక్రవర్తిత్వము సం
పాదించిన సార్వభౌముడు సహితమాధర్మములనే యనుస
రింప వలసినవాడైయున్నాడు. ధర్మమంతయు దైవనిర్మితమను
ప్రధాన విశ్వాసముతో బ్రవర్తిల్లుటచే సామాన్యుల కెవ్వరికి
నట్టిది మార్చుటకధికారములేదు. మానవాతీతుడైన యొకమ
హాపురుషు డెప్పటికైన నవతారమునిపించుకొన గల్గినయెడ
ల నాతనికి మరల ధర్మమును నిర్ణయించుటకు వీలుకలుగగలదు.
అనగా నప్పటి ప్రజలెల్లర నేదోయొక సమ్మోహనాస్త్ర ప్ర
యోగమున వశంవద మొనర్చుకొనగల్గిన మానవునకే కాని
ధర్మసూక్ష్మము మార్చుటకు వీలులేదన్నమాట! అట్టిప్రత్యే
క పరిస్థితి వచ్చునంతకు ధర్మము స్థిరము మార్పునొందుట క
వకాశము లేనిదియునై యుండుచుండెడిది. కావుననే రాజు,
చాతుర్వర్ణ్యములలోని ప్రజలు ఒక్క ధర్మమునే యాశ్రయిం
చి బ్రదుకవలసిన వారలగుటచే రాజు నైరంకుశ్యమున కెంత
మాత్ర మవకాశము గల్పింపదు. మఱియు వేదకాలమునుండి



ప్రజలెల్లరు నేకాభిప్రాయము నొందవలసినదే కాని కొంద
ఱొకవిధముగ నభిప్రాయపడుట కవకాశమే లేదు. ఎల్లరంగీక
రించువఱకు ధర్మనిర్ణయము తేలనే తేలదు. కావున నిప్పటి
మెజార్టీ మైనార్టీ లన్నమాట లప్పుడు లేవు. నైతికమున, సాం
ఘికమున, రాజకీయమున బ్రజల నరికట్టి యొక్క ఋజుమార్గ
మున బట్టింపగల శక్తి ధర్మస్వరూపమై నిగ్రహానుగ్రహ సమ
ర్థమై సహస్రాక్షములతో సహస్ర పాదములతో సర్వాంత
ర్యామియై యనాద్యనంతమైన భగవంతుడే యైయున్నాడు.
ఈతనికి సార్వభౌముడు చక్రవర్తి, సామాన్యమానవుడు నను
పక్షపాతబుద్ధిలేకుండ నెల్లర నొక్కవిధముగ బుణ్యపాపముల
కు రక్షాశిక్ష లొసంగుచుండునని విశ్వాస మాకాలపు ప్రజల
కెల్లరకు నుండుటచే ధర్మము నాల్గుపాదముల నడుచుట కవ
కాశము చిక్కినది. ఈ భగవంతుని ధర్మములు పాపపుణ్య
వివరములు ప్రజలకెల్లర కెల్లప్పుడు బోధించుచుండుటయే
బ్రాహ్మణులపని. భగసంతునిమీద భయభక్తులతో బ్రజల
రక్షించుటయే రాజులగు క్షత్రియులవిధి. అట్టి భయభక్తుల
తోడనే తమ స్వధర్మము నిర్వర్తించుకొనుచు వ్యవహరించు
టయే మిగత వర్ణములవారి కర్తవ్యము. కనుకనే యీనాల్గు
వర్ణములనిర్మాణమునందే ప్రజాస్వామిక పరిపాలనా విధాన
మూల బీజము లిమిడియున్నవని చెప్పవలసినది. వర్ణములు

వర్ణముల ననుసరించి నిర్మింపబడిన గ్రామపంచాయితులు, సమితులు సభలు గణములు వర్గములు మహాసభలు నన్నియు వేదకాలమునందే యున్నట్లు ప్రబల నిదర్శనములున్నవి. ఇట్టి సంస్థలతో గూడిన సాంగోపాంగమైన గ్రామమే శుద్ధస్వతంత్రమై సమగ్రమై ప్రజాస్వామికమై యితరగ్రామ సంస్థలతో సమానాధి కృతమై విరాజిల్లి యీభరతఖండమున కింతకాలము స్వరాజ్య మనుభవించుట కవకాశము గల్పించినదని. తజ్ఞలూహించుచున్నారు. సర్. చార్లస్ మెట్కాఫియను సుప్రసిద్ధాంగ్లేయుండు 1832 వ సంవత్సరమున బంపిన రిపోర్టు నీక్రిందివిధముగ నీవిషయమై వ్రాసియున్నాడు:—

"The village communities are little republics having nearly, everything they can want within themselves and almost independents of any foreign relations. They seem to last where nothing else lasts. Dynasty after dynasty tumbles down; revolution succeeds revolution; but the village community remains the same. This union of the village communities, each one forming a little state in itself has, I conceive, contributed more than any other cause to the preservation of the peoples of India through all the resolutions and changes which they have suffered, and is in a high degree conclusive & their happiness and to the enjoyment of a great portion of freedom and independence,"



"గ్రామసంస్థలు చిన్న ప్రజాస్వామికములు వానికిగావలసినవన్నియు గలిగియుండి విజాతీయసంబంధములు లేకుండ స్వతంత్రములై యున్నవి. ఎట్టిదియు నశించుచోట గ్రామసంస్థలు బ్రదుకగల్గినట్లు కనబడుచున్నది. సామ్రాజ్యము తరువాత సామ్రాజ్యము కూలిపోవుచున్నది. మహాపరివర్తనము వెంటనే మఱియొక పరివర్తనము పుట్టుచున్నది. కాని గ్రామసంస్థ మాత్ర మెప్పటియట్ల బ్రతికియున్నది. ఒక్కొక్కటియు చిన్నరాజ్యమువలె ప్రకాశించు నీగ్రామసంస్థా ప్రణాళికయే హైందవ జాతీయత ననేక విప్లవములు పరిణామములనుండి కాపాడుటకు గారణమైనదని నాయభిప్రాయము. హైందవులనుభవించిన స్వతంత్ర స్వేచ్ఛలకిదియే చాలవఱకు మూలకారకమని నేననుకొనుచున్నాను," అని యాదొరగారు వ్రాసియున్నారు.

ఇట్టి సమగ్ర స్వతంత్ర ప్రజాస్వామికములైన గ్రామములనుండి రాజులు కొంతభాగము పన్నులు వసూలు చేసికొనుట తప్ప నేయితర సాంఘిక నైతిక శాంతికాది విషయములందు జోక్యములు కలుగజేసికొనకపోవుటచేతనే యన్నివేల సంవత్సరములుగా నన్నివందలమంది చక్రవర్తులు బయల్దేరి రేకచ్ఛత్రాధిపత్యముగ నింత విస్తీర్ణముగల భరతఖండమున ప్రయాణ సౌలభ్యములు లేకపోయినను బరిపాలిం

పగల్గిరి. ఐరోపాదేశమున నాదిమకాలమునుండి నేటివఱకు రాజు రాజ్యము సమస్తమత సాంఘిక నైతిక విషయములందు సహితము పాల్గొనుటకు సుసిద్ధముగుటచే నక్కడ ప్రజాస్వామిక పరిపాలనమంత యాలస్యముగ బొడసూపగల్గినది. మనదేశమందలి పూర్వరాజ్యాంగ విధానము చూచియే మనదేశమునందు నట్లేయనుకొని భ్రమపడి యజ్ఞానకృతముగ గొందఱు చరిత్రకారులు మనదేశచరిత్రల నట్లు వ్రాయసాహసించిరి. ఈవ్రాతలఁజూచి మనమును భ్రమపడుచున్నాము. ఇట్టి ప్రజాస్వామిక పరిపాలనా సౌష్టవము పదివేలసంవత్సరములనుండి నిరంతరాయముగ ననుభవించిన హిందూదేశమున ప్రజలలో విద్యయేల యింతతక్కువ కావలెను? అనుసంశయమొకటి కలుగవచ్చును. విద్యయొక్క నిర్వచనము మనదేశములో వేదకాలమునుండియు నొక్క చిత్రమైన పరిస్థితులనున్నది. చదువుట వ్రాయుట యనునవి విద్యలో ప్రధానాంశములుకావు. గురు శుశ్రూషవలన సత్సాంగత్యము మూలమున సంపాదించిన యనుభవరూపకమైన విజ్ఞానమే విద్యయనబడుచున్నది. వేదవిద్యయు శాస్త్రాధ్యయనమును గూడజాలవఱకు గురువునుండి జ్ఞాపకశక్తితో సంగ్రహింపబడుచునే వచ్చుచున్నవి. ఇఁక శారీరశ్రామిక విద్యలు శిల్పవిద్యలు కృషివిద్యలు సమస్తకళలు చదువుట వ్రాయుటలతో నంతగా సం



పర్కము లేకుండగనే పరంపరాగతముగా గురుశిష్యన్యాయములఁ బ్రసరించుట యాచారమైపోయినది. కావుననే నాల్గువేదములు వేదాంగములు నధ్యయనమొనర్చి పండితులు సహితము కొందఱు నిశానీదారులై యుండెడివారు. రాజ్యాంగ సందర్భములో మఱియుం బెచ్చుపెఱిగి యీపఠన లేఖనా సమర్థత విరాజిల్లియున్నది. ఆసేతు హిమాచల పర్యంతము నేకచ్ఛత్రాధిపత్యముగ బరిపాలించి జగజ్జేగీయమానుఁడైన యక్బరు పాదుషా సహితము నిశానీదారుడని యొక చరిత్రకారుడు వ్రాయుచున్నాఁడు. పాంచాల సింహమని పేరెన్నికగాంచిన రణజిత్సింగు గూర్చియు నిట్టిప్రతీతియే కలదు. ఇట్టిపరిస్థితులలో జనసామాన్యమునకు సాధారణవిద్య లేదని యెవ్వరు విచారింతురు? వారల కైహికమగు పారిశ్రామి కాద్యనుభవము గురుపరంపరగ వచ్చియుండ నాముష్మికమగు భగవద్భక్తి మొదలగు ధర్మములన్నియు శ్రవణమననాది సాధనముల మూలముననే సంగ్రహింప బడుచుండ జదువ లేరని వ్రాయజాలరని మూర్ఖులనుట కెక్కడనవకాశమున్నది? ఇప్పటి నవీన సామాజిక విద్యాపాఠశాలాదికము లప్పుడు లేకపోయినను గురుగృహములే విశ్వవిద్యాలయములై యనేక శిష్యకోటి నాదరించి విద్యానిలయములై వెలుగుచుండెడివనియు నందు వర్ణవివక్షత లేకుండగనే వేదకాలమునుండి చాలకాలమువఱకు

సమస్తవర్ణములలోని యుత్సుకులును విద్యాభ్యాసము నొనర్చుచుండెడివారని మనము నిర్వివాదముగ నమ్మవచ్చును. ఇదిగాక రాజధాని నగరములందు మహారాజులనేకపండితుల సేకరించి గొప్పగొప్ప విద్యాస్థానములుగ నెలకొల్పి భూరివిశాళములతోఁ బోషించుచుండెడి వారనునది సంశయింప బనిలేని విషయమే! ఇట్టిపరిస్థితులందు విద్యయంత వ్యాప్తి కాలేదేమి యని ప్రశ్నింప నవకాశమున్నదా? ఐహికాముష్మికములకు నుపయోగించి సమస్తవిజ్ఞానము పరంపరాగతముగ ననుభవరూపముగ సుస్థిరమై యెల్లర కందుబాటులో నున్నప్పుడు విద్యలేదనుకొనుట వెఱ్ఱికాదా! వేదవేదాంగ విశారదత్వము గాఢతాత్త్విక వివేకము, అనేకభౌతికశాస్త్ర పరిపాకము, పారిశ్రామిక శిల్పాది కళావిలాసము మిగతదేశము లన్నిటికంటె మిన్నయై మనభరతమాత సేకరింపగల్గిన యాకాలములో విద్యలో గొఱతయేమోయని సంశయించుట భావ్యమా? కావున నింతటితో విద్యగూర్చిన యాభ్రమప్రమాదము మనలను వదలునుగాక!

షడాదికెన్నో యజ్ఞయాగములు స్వర్ణతులాభారములు రత్నఖచిత సింహాసనములు మణిమయస్థంభ మండపములు మౌక్తికతోరణములు మృష్టాన్నభోజనములు భూరి సంతర్పణములతో సర్వోపభోగము లనుభవింపగల్గిన యాకాల



మందు భరతఖండ మెంతటి యైశ్వర్యవతియో వేఱువర్ణింప నక్కఱలేదు.

కావున ప్రాచీనకాలమునందు మనభరతఖండము సంపూర్ణ స్వతంత్రముతో గూడిన ప్రజాస్వామిక పరిపాలనా విధానసమ్మిళితమైనపరిష్కృతరాజ్యాంగము కలిగియుండి సమస్తైశ్వర్యములు సకలభోగ భాగ్యములు ననుభవించి యప్పటి విదేశీయులకు దుర్నిరీక్షమై వెలింగినదని చెప్పుటకావంతయు సంశయింపబనిలేదు. ఇట్టిమహద్భాగ్యము సృష్టిమొదలు పాశ్చాత్యచరిత్రకాల ప్రారంభమువరకు నవిచ్ఛిన్నముగ నున్నదనియే మనమూహింపవచ్చును. పాశ్చాత్యులు క్రీస్తుకు పూర్వము 32[illegible] వ సంవత్సరమున హిందూదేశమునకు దండెత్తివచ్చిన గ్రీకురాజగు అలెగ్జాండరుతో హిందూదేశచరిత్ర ప్రారంభింపజూచెదరు. ముందు ప్రకరణమునందు బహుసంక్రమము నకిదియెట్లు ప్రతిపదికమైనదో జూచెదముగాక, కాని యీ గ్రీకుదండయాత్రవలన గడుంగొలంది సంవత్సరము లిక్కడనిల్చిన గ్రీకులు కొందరు హిందూదేశసౌభాగ్య మప్పుడెట్లున్నదో సవిస్తరముగ సాక్ష్యములిచ్చుటకు తగిన గ్రంథరాజములు వ్రాసియున్నారు. అందు మెగాస్థనీసు అనురాయబారి చంద్రగుప్తునిరాజు దివాణమునకు బంపబడి యక్కడ గొన్నాళ్లుండి యప్పటి రాజ్యాంగవిధానము గూర్చివ్రాసిన పూర్వచరి

త్రవిషయము మిక్కిలి ముఖ్యమైయున్నది. మెగాస్థనీసు దక్షిణహిందూదేశము సహితము సంచారమొనర్చి యక్కడి ప్రజలయొక్కయు రాజులయొక్కయు భోగభాగ్యములనుగూర్చి మిక్కిలిపొగడియున్నాడు. గ్రామపంచాయితీల యొక్క సౌష్టవముగూర్చియు రాజులయొక్క నియమితాధికారముల గూర్చియు నీతడు మిక్కిలి వివరించినాడు. నందరాజ్యవిధ్వంసనకారకుడు మౌర్యరాజ్యప్రతిష్ఠాపకుడు ప్రచండచాణక్యబిరుదాంకుడునగు బ్రాహ్మణుడగు చాణిక్యుడు చంద్రగుప్తుని ప్రధానియై వ్రాసిన యర్థశాస్త్రము చంద్రగుప్తుని రాజ్యాంగవిధానము పూర్తిగ వివరించి చెప్పుచున్నది.

గ్రామము లెప్పటివలెనే శుద్ధస్వతంత్రములై ప్రజాస్వామికములై చంద్రగుప్త రాజ్యవిధానమునందును బరిగణింపబడినను గాలానుసరణమున మరికొన్ని నిబంధనములతో సామ్రాజ్యపరిపాలనా సౌకర్యార్థము గ్రామములు నైదుతరగతులుగా విభజింపబడినవి. మొదటివి- మతవిద్యా విషయములకై పన్నులేమియు నీయనక్కరలేకుండ బ్రత్యేకింపబడినవి. రెండవతరగతి:- పన్నులకుబదులు సైనికులను సామ్రాజ్యమునకు సమకూర్చుట కొప్పుకొన్న గ్రామములు. మూడవతరగతి:— వస్తురూపముగనో ద్రవ్యరూపముగనో పన్నులు చెల్లించునవి. నాలుగవతరగతి సామ్రాజ్యములో జరుగు సమస్తకార్యములకు గూలీలను పారిశ్రామికులను కళాకుశలురను సమకూర్చు గ్రామములు. ఐదవతరగతి సామ్రాజ్యవ్యయముకై ధాన్యాదికములు మాత్రమే సమకూర్చ బ్రత్యేకింపబడిన గ్రామములు. ఇట్లు అయిదు తరగతులుగా విభాగింపబడిన ప్రతిగ్రామమును బూర్వమువలెనే తనయంతర్వివిధ పరిపాలనములందు దన కులాధికారులతో కూడిన పంచాయితీలతో ప్రజాస్వామికముగ స్వతంత్రమనుభవింపవలసినదే!



మరియు నార్థికరాజకీయ సౌష్టవమునకై సంపూర్ణరక్షణము కొరకును ప్రతిపదిగ్రామములలో నొకగ్రామమును బ్రధానముగ నొనర్చి యందు తగు సైనికసహాయము సమకూర్పబడి సమస్తవస్తువు లాపదిగ్రామములకు దొరుకుటకై యొక సంతబజారు కల్పింపబడి, సామ్రాజ్యమునకు గ్రామమునకు కొలికవలె విరాజిల్లుచుండెడిది. రెండువందల గ్రామములకొక్క మండలగ్రామమునందు ఖరవాటికయను నొక కోటయు దగు సిబ్బందియు నుండుచుండెడిది. నాలుగువందల గ్రామములకొక కేంద్రగ్రామమేర్పడి యందు ద్రోణముఖమను కోట నిర్మింపబడుచువచ్చెడిది. ఎనిమిదివందల గ్రామములకొక రాష్ట్రమేర్పడి దానికి రాజధానిగ బ్రకాశించు గ్రామమున మిక్కిలిరక్షణసమర్థమైన స్థానీయమనబడు పెద్దకోట కట్టబడుచుండెడిది. ఇట్లు దేశమంతయు సంపూర్ణముగ సైనికసంరక్షణలతో సా

మ్రాజ్యము ప్రసరించి తనవిధి నెఱవేర్చుకొనుట కవకాశము చంద్రగుప్తుని కాలములో బాగుగ ప్రతిష్ఠింపబడినట్లు చాణిక్యుని యర్థశాస్త్రము ఋజువుచేయుచున్నది.

ఈసందర్భముననే చంద్రగుప్తుని కాలములో హిందూ దేశమునకంతకును ప్రధానరాజధానియైన పాటలీపుత్రమెట్లువిరాజిల్లినదో కనుంగొనుట న్యాయము. చిన్నపల్లెలోని గ్రామపంచాయితీవలెనే యిదియు ముప్పదిమంది సభ్యులనెన్నుకొని యారు పంచాయితుల క్రింద వీరిని నియమించెడివి. ఇందు మొదటి పంచాయితీ పరిశ్రమలను జేతిపనులను సక్రమముగజరుగుచుండుటకై నియమింపబడుటయు రెండవది పట్టణమునకు వచ్చుపరదేశీయులు, బాటసారులు, యాత్రికులు మొదలగు వారలకు వలసిన సౌకర్యములన్నియు సమకూర్చుటకు నియమింపబడుటయు నీపంచాయితీయే విదేశీయులపై గాఢపరిశీలనము కలిగి, యవసరమగునట్లు వైద్యాది సహాయములొసర్చుట కధికారము సౌకర్యమును గలిగి యవశాత్తు వీరిలోనెవ్వరైన పరమపదించినచో వారి బంధువులడుగువరకు వారి యాస్తియంతయు జాగ్రత్త పరచుటకు గూడ బూనుకొనియుండెడిది. ఇక మూడవ పంచాయితీ పన్నులువగయిరాల సౌకర్యార్థము జనన మరణముల వ్రాసికొనుచు జనాభా లెక్కలెప్పటికప్పుడు తయారుచేయుచుండెడివి. నాలుగవది తూకపురా



ళ్లు కొలతపాత్రలు వ్యాపారవస్తువుల పరీక్షించవలసిన వాణిజ్యపు పన్నులు వసూలుచేయుటకును, నైదవది చేతిపనులపై బన్నులు మొదలగునవి వసూలుచేయుటకు, నారవదియునిట్టి యితర వ్యాపారములన్నిటిమీద విధింపదగిన పన్నులు విధించి వసూలుచేయుటకు నేర్పడెడివి. ఇదికాక ముప్పదిమంది సభ్యులు గల యీసభ పట్టణమునకు గావలసిన నీటిపారుదల పుష్పవనములు, ఆరోగ్యము, రాజభవనముల నిర్మాణపరిత్రాణములు బాటలును, సంతలు, తీర్థములు మొదలగు సమస్తకార్యముల నిర్వహించుచు పాటలీపుత్రము నిప్పటి నవీనసాంఘిక శాస్త్రాంగీకృతమాదగు సమగ్రపట్టణముగా క్రీస్తుశకమునకు బూర్వము మూడువందల సంవత్సరములనాడే ప్రకాశించునట్లు పరిపాలించుచుండెడిది. ఇట్టిపాటలీపుత్రముచే పాలింపబడిన సామ్రాజ్యమంతటను గ్రామమునుండి గ్రామమును గలుపుబాటలు దేశము సీమూలనుండి యామూలకు గొంపోవు గొప్ప పధికములు- ఈపధికముల కిరువైపులు వృక్షములు. దూరము దెలుపు కొలతరాళ్ళు సంజ్ఞాఫలకములు- అక్కడక్కడ సత్రములు, రక్షకభటస్థానములు, వైద్యశాలలు మొదలగు సమస్త సౌకర్యములతో దేశము యావత్తు గమనాగమన సౌష్టవముతో సుఖించినదని మేగాస్థనీసు సాక్ష్యమిచ్చుచున్నాడు. ఇవిగాక నదులయందు గాలువలలో సముద్రముమీదబోవు శత

సహస్రములగు పడవలు ఓడలు నడుచుచున్నవనియు నందు వ
ర్తకులపై సామంతులవియుగాక సామ్రాజ్యమునకుచెంది ప్ర
యాణికులను వర్తకపు సరుకును గొంపోవుచున్నవియు సుమ
త్రా చైనా పర్షియా బేబిల్ ప్రాంతములకు హిందూదేశము
విరివిగా వర్తక మొనర్చుచున్నదనియు నాతడు ఘంటాపథ
ముగా వాక్రుచ్చియున్నాడు. ఇతర పాశ్చాత్య ప్రపంచకము
న కంతకు బ్రాథమిక చారిత్రకాలమగు నానాడే యీ హిం
దూదేశమునకు నదులనుండి కాలువలు త్రవ్వింపబడుటయు
ఆనకట్టులు కట్టింపబడుటయు బ్రహ్మాండములగు చెర్వులునిర్మిం
పబడుటయు జరుగుచుండెడివని మెగాస్థానీసు సెలవిచ్చుచున్నా
డు. చంద్రగుప్తుని సామంతుడగు వృష్యగుప్తుడను రాజు,
గిరినగరువద్ద నొక నదికి గొప్ప యడ్డకట్టు కట్టించి సుదర్శన
మను సరస్సు నిర్మించినట్లును అందునుండి యెన్నోగ్రామము
లు సేవ్యమగుచుండినట్లును ఆసరస్సు నాతని తరువాతి తరము
లవారు 800 సంవత్సరములు కాపాడ గల్గినట్లును శాసననిద
ర్శనములు కూడ గలవు.

ప్రతి పల్లెటెగ్రామములోగల చాతుర్వర్ణ్యములును ద
మలోగల సాంఘిక నైతికమతసంబంధములగు దోషములు
తమ పెద్దలచే దూషింపబడి నిరూపింపబడి ప్రాయశ్చిత్తాదిక
శిక్షలు పొందుచుండ నాగ్రామములో నెల్లరకు సంబంధించిన



చోర వ్యభిచార ఋణాపహరణ భూమ్యాక్రమణము మొదల
గు నేరములన్నియు నాగ్రామమునకంతకు నేర్పడిన పంచాయి
తీ నిరూపించి శిక్షించుట యాచారమైయున్నది. ఇదిగాక మం
డలరాష్ట్ర సామ్రాజ్య స్థానములందు గల పెద్దపంచాయితు
లు క్రింది పంచాయితులలో వచ్చువివాదల బరిష్కరించున
ధికారముకల్గియుండునట్లు చంద్రగుప్తుని కాలమునందు నిర్ణయ
మున్నట్లు మెగాస్థనీసు అభివర్ణించుచున్నాడు.
సామ్రాజ్యపరిపాలన మంతయు నెనమండ్రుమంత్రులుగల సం
ఘముతో జక్రవర్తి పరిపాలించుటయై యున్నది. ఒక్కొక్క
మంత్రియు నిద్వరు సహాయకార్యదర్శులతో ఒక్కొక్క రా
జ్యాంగ భాగము పాలించుచు మొత్తమెనమండ్రు సమస్త
విషయములందు గలసి వితర్కించి విషయనిర్ణయ మొనర్చుట
కధికారము కలిగియున్నారు. ఈసంవిధానమందు రాజు నిరం
కుశుడుగాకుండ నుండుట కిదివరకుచ్చరింప బడినట్లుగా ప్రజా
క్షేమము దైవనిర్మితధర్మముగా క్షత్రియుల నెత్తిపై నున్నద
ను విశ్వాసమే యెప్పుడుపనిచేయగల్గినదని మెగాస్థనీసు సహిత
మొప్పుకొన్నాడు. పట్టాభిషేక మొక మత విధానముగుట
యు నందు బ్రజలకసంతృప్తి కలుగజేసినయెడల నాయుత్తర
లోకములకు వలసిన పూర్వపుణ్యము నశించుగాక, నేను నిస్సం
తానుడనై నశించెదనుగాక, యను ప్రమాణమందు బోధాన

మగుటయు, మత ప్రాధాన్యముగల హైందవరాజులకెల్లరకు నంకుశమై సక్రమమార్గమునకు ద్రిప్పుచుండెడిదని మనము విశ్వసింపవచ్చును. ఒకవేళ నొకప్పుడొక రాజెవ్వడైన నిరంకుశుడుగా నుండనిచ్ఛగించినను నాతని నైరంకుశ్యమాతని పట్టణము సద్దానిని సమీపమునందున దప్ప దేశముయావత్తు సంక్రమించుటకవకాశమేకలుగుచుండెడిదికాదు. ఎట్లనిన గ్రామములలోగల పంచాయితులు సమస్తవిధముల న్యాయవిషయములను బరిశీలించి తమచిత్తమువచ్చిన శిక్షాదికము లొనర్చుటకధికారములుకల్గియుండుచున్నవికదా! రాజు వసూలుచేసికొనదగిన పన్నులుగూర్చికూడ నదివరకే శాసనములై ధర్మశాస్త్రములకెక్కిన పద్ధతులేకదా యనుసరణీయములు! ఇక రాజు నైరంకుశ్యము గ్రామములకుగూడ బాధించుటకు దగినంత నైశిత్యమొందుటలో నుండగలదు. ఒకవేళ నాతడు దండెత్తికొన్న గ్రామములు రూపుమాప బ్రయత్నించినను నట్టి గ్రామములనుండియే కదా యాసైన్యమును సమకూర్చుకొనవలసియున్నాడు! అన్యోన్యసంబంధముగల యీగ్రామవాస్తవ్యులట్టి దారుణకృత్యము లొడిగట్టగలరా? కావున రాజును బ్రతిఘటించి దుష్ప్రవర్తననుండి మరలించుటకెన్నో సావకాశములు ప్రజలకుండియుండెడివని మనము స్పష్టముగా నమ్మవచ్చును.



మఱియు బరిపాలనాంగములకు పన్నులు వసూలుచేసికొనుట సైన్యము సంరక్షించుకొనుట తనవఱకు వచ్చిన వివాదల బరిష్కరించుటయు దప్ప రాజునకు మిగత యధికారము లేమియు లేనేలేవు. వాణిజ్యము, వ్యవసాయము, జలసౌకర్యములు, ఆరోగ్యము నైతికసాంఘిక సంరక్షణము మొదలగు నన్ని బాధ్యతలు గ్రామములలోని పంచాయితీలే నిర్వహించుకొనుచుండుటయుదములోగల వివాదల పైగ్రామములలోని పెద్ద పంచాయితులవలన దీర్పించుకొనుటయు జరుగుచు వచ్చిన యాగ్రామములపై రాజు నామమాత్రుడేకాని విశేష బాధ్యతగల నాడెంతమాత్రమును గానేరడు. కావున హైందవస్వరాజ్య విధానమంతయు బ్రజాస్వామికమే యనియు రాజున్నను నిరంకుశుడెన్నటికిని గాడనియు నిదివరకు చెప్పవలసివచ్చినది.

ఇక నిట్టిపంచాయితులు, గణములు, శ్రేణులు, పూగములు, వర్గములు, సంవత్సరవారకములు మొదలగుసంఘములన్నియు వర్ణసంబంధములై నిజమైన యెన్నికలతో గూడిన ప్రజాస్వామిక ప్రతిష్ఠాపనములు కావేమోయని యొక సంశయము పొడమవచ్చును. కాని యిట్టి గణములు సంఘములుకాని నిరూపణములు కాని నిరూపణములు తెలుపగలుగు శాసనములెన్నో దొఱికియున్నవి. వీనియాథార్థ్యము బుజువుచేయుట

కో యనునట్లు ఆసేతు హిమాచలపర్యంతము కూడనిట్టి శాసనములు దొరికియుండుట మిక్కిలి యాశ్చర్యము గొలుపవలసినదే! అందు ఉత్తరమల్లూరు బి. అను శాసనమునందు నిట్టి సంఘముల యెన్నికలు సభ్యతార్హతలు పూర్తిగ వివరింపబడియున్నవి. ఈయుత్తరమల్లూరను గ్రామము 12 వీధులుకలదనియు నది ముప్పదిభాగములుగ విభజింపబడి యొక్కొక్కభాగమునందు నాభాగమందలి గృహస్థులు కలిసిసభ చేసినట్లును అందొక్కొక్క డొకయాకు తన యిచ్చవచ్చిన సభ్యునిపేరు వ్రాసి యొక కుండలో వేయుననియు నట్లు ప్రతిభాగమున నొక్కొక్క కట్టచొప్పున గ్రామదేవాలయములలో గల దేవతాసన్నిధిని గల యొకపెద్దకుండలో బడవేయబడుననియు తుదకొక పర్వదినమున గ్రామములో గల యాబాలగోపాల మటకు వత్తురనియు గ్రామములోనికెల్ల వయస్సులో పెద్దవాడైన యొక ముదుసలి యాకుండ సమీపించి యాకట్టలన్నియు నందరి యెదుట విప్పి మరియొక కుండలోవైచి గిరగిర కలియునట్లు త్రిప్పిత్రిప్పి యాగుంపులోగల యొక చిన్ని బాలునిచేత నాకుండనుండి యొక్కొక్క యాకే తీయించి యొక్కొక్కటియు బహుమందికి చదివి వినిపించి యట్లు ముప్పదియాకులు తీసి ముప్పదిమంది సభ్యులను జేర్కొనుననియు వ్రాయబడియున్నవి. ఇట్లు చేర్కొనబడిన సభ్యులు సభ్యత్వము తమ క



క్కరలేదనగూడదనియు నిట్టివి దైవికధర్మములనియు నెంచుకొని యంగీకరించి యూరు పంచాయితులుగా సమకూడి గ్రామమునగల వివిధ వ్యాపారములు మంచిగంధమున నొకకాలు నగ్నిహోత్రమున రెండవకాలు వైచినట్లు తన్నెంచుకొని యూదారవత్రముగా ప్రజాహితైషులై కర్తవ్యము నిర్వర్తించుననియు నిట్టి యెన్నిక ఏడాదికొకసారి తప్పక జరుగగలదనియు వివరింపబడియున్నది. ఇద్దానింబలపఱచు శాసనము లెన్నోకలవు కావున దీనివలన నియ్యవన్నియు కేవలజాతి సంబంధములు కాక ప్రజాస్వామికములై యలరారుచున్నవని మనము తెలిసికొనగలము.

ఇట్లు బలిష్టములై సమగ్రములై ప్రజాస్వామికములైన పంచాయితులే ప్రాతిపదికములుగాగల్గి మన ప్రాచీనస్వరాజ్యతత్త్వము వన్నెకెక్కినదైయుండుట యెఱింగిన బుద్ధిమంతుడెవ్వడును మనకు స్వరాజ్యార్హత లేదనుటకు సాహసించునా? సాహసించినచో వానిని లోకము బుద్ధిమంతుడనగలదా? ఇట్టి పాలనాసౌష్ఠవముకలిగిన హిందూదేశమునకు ఆంగ్లేయులిప్పుడు క్రమక్రమాగత సంస్కరణచట్టములచే స్వరాజ్యము ప్రజాస్వామికము నేర్పజూచుచున్నారా? ఓహో! ఎంతటిగురుత్వము? ఎట్టిశిష్యత్వము? ఏమిగురుశిష్యన్యాయము? ఏమిదయ? కానిండిదియొక సరసమని యెంచుకొందము:— ఆంగ్లేయదేశము

లోగల యిప్పటి ప్రభుత్వవిధానము పరిపూర్ణత్వమందినదని వారుచెప్పగలరా? కాలము దొర్లినకొలది ననేకవిధపరిణామములందుచుండుటలేదా? మూడువందల సంవత్సరములు హైందవసహవాసముచేసియు గ్రామనిర్మాణ చమత్కారము గ్రహింపలేనికారణమున దమదేశములోగల పారిశ్రామిక వైషమ్యములచే నెదుర్కొనబడుటకు సిగ్గుపడుటకుమాఱు మనకు స్వరాజ్యశిక్ష యొనర్పజూచుట యెంతటిసాహసమో యహంభావమో వేఱువర్ణింపనక్కరలేదు.

ఆర్యనాగరికత యతిప్రాచీనమైనదని యింతవఱకెఱుంగుదుము. ఆర్యనాగరికతయే హైందవమని వేఱువివరింపబనిలేదు కాని పాశ్చాత్యనాగరికతకంటె నెందులో నార్యనాగరికత యుత్కృష్టమైనదో తెలిసికొనుటమంచిది. ఇందులకు నాగరికత యననేమిటో తెలియకతప్పదు. ప్రజాసంఘము లొక్కొక్కచో జేరి కాలప్రవాహమున నెడతెగని గమనముతో నీదుకొనుచు నొక్కొక్కరీతి సాంప్రదాయ ప్రసిద్ధమగు నాచారవ్యవహారములలవఱచుకొని యొక్కవిధమగు నాగరికత సమకూర్చుచుండును. ఏప్రజాసంఘము ఐహికాముష్మికములందు సులభసౌఖ్యము లొందగలుచున్నారో, యాప్రజాసంఘమున కలపడిన నాగరికత యుత్కృష్టమైనదియు సార్థకమైనదియునని చెప్పవచ్చును. మఱియు నట్టినాగరికతవలన మానవుడు



సౌఖ్యము సౌఖ్యతనొందగల్గుచున్నాడో యట్టినాగరికతయు సమంజసమని యభివర్ణింపబడును. సౌఖ్యము, సౌజన్యతలెట్లుండును? ఇంద్రియవశమైన యీప్సితార్థసిద్ధియే సౌఖ్యమని చెప్పవచ్చును. ఇతరజీవికేవిధమునను బాధాకరము కాకుండుటయే సౌజన్యత యనవలయును. కావున మానవుడు తనయింద్రియేప్సితముల నితరాబాధకముగ నొందగల్గుటయే నాగరికతకు గావలసిన ప్రధానప్రయోజనమని నిర్వచన మేర్పడుచున్నది. ఇట్టిదిసంఘటిల్లుటకు బరిపూర్ణమైన నైతికపరిపాకము ఆర్థికసమృద్ధి విజ్ఞానప్రకాశము లుండితీరవలెను.

నైతికపరిపాక పాటవములేనిదే యింద్రియములు వశ్యములై సత్ప్రవర్తనములో నుండజాలవు. ఆర్థికసమృద్ధిలేనిదే యనుభవమునకవకాశమేదొఱకదు. విజ్ఞానప్రకాశ మిన్నిటికి మూలకారణమనకతప్పదు. కావున నాగరికత విజ్ఞానముమీదనే యెక్కుడుగ నాధారపడియుండును. ఆర్యులవిజ్ఞానము అసమగ్రమని యేచారిత్రకుడును నుడువజాలకపోయెను. ఆర్యవిజ్ఞానమెంత ప్రాచీనమో యంతపరిపూర్ణమనియే తజ్ఞుల యభిప్రాయము. సర్వేంద్రియ సంకోచనముతోగూడిన తపోనిగ్రహములే ముక్తిమార్గములని యాముష్మికపరిణతావస్థలో నిర్వచనమొనర్చుకొనిన యార్యులకు నైతికబలమెంతయుండెనో వివరింపనక్కరలేదు. "పరోపకారార్థైక పుణ్యాయ పాపాయ పరపీడ

నమ్,, అను పుణ్యపాపవివక్షత నేర్పఱచుకొన్న యార్యులగు హైందవులకు నీతిసంపత్తి తక్కువ యనుటకు నోరాడదు- పాతివ్రత్యము, ఏకపత్నీవ్రతము, అహింస, మొదలగు గణ్యేతర నీతిపరంపరలకు ఆర్యులలోనే యుదాహరణములు దొరకగలవు- జ్ఞానసాంప్రదాయములో దార్శనికముగ నాఖరుమెట్టెక్కి నవేదాంతరహస్యము లార్యులవిజ్ఞానమునకు నైజసాక్ష్యము లిచ్చుచున్నవి- బేబిలన్ నగరముతో వేలకొలది వత్సరములుగ జరిగినవర్తకము- ఈజిప్టులోని మమ్మీలకు జుట్టబడుటకుపయోగింపబడిన ఢక్కామజిలీనుల, ప్రాచీనతా సౌందర్యములు, సుమత్రాద్వీపము లాక్రమించిన నౌకానిర్మాణ చాకచక్యము, వేలకువేలు సంవత్సరములు శాశ్వతస్థాయులుగ నుండుటకునిర్మింపబడిన యనేకదేవాలయాది భవననిర్మాణ కౌశల్యము- పైనివివరింపబడిన రాజనీతి ప్రజాస్వామికమైన రాజ్యాంగవిధానము- మొదలగు నెన్నోయంశములు హైందవార్య ప్రాపంచికార్థికవిజ్ఞాన ప్రకాశమెంతటిదో చాటిచెప్పుచునేయున్నవి- ఇట్టివిజ్ఞానము- అట్టినైతికపరిపాకము, జగమెఱింగిన యార్థికసమృద్ధి ఆర్యనాగరికతయొక్క ఫలితములేకదా! ఇట్టినాగరికతకు లోపమేమున్నదో పాశ్చాత్యులిప్పుడు వీరలకు నేర్పవలసినదేమికలదో తజ్ఞులే గ్రహింపగలరు- ప్రాచీనస్వరాజ్యపు దినములలో నార్యులనుభవించిన భోగభాగ్యములు సిరిసంపద



లు వారుప్రకటించిన పరాక్రమాది ధైర్యగుణరాజములు, ఏ సంస్కృతగ్రంథములోని యొకపత్రమునుండి యటుతిప్పి చూచినను బోధపడకపోదు. అనారోగ్యమే యెఱుంగని దీర్ఘాయుష్యము, దరిద్రమే తెలియని ద్రవ్యసమృద్ధి, పిరికికండయే లేని ప్రవిమల పరాక్రమసంపత్తి చలనమేలేని ధైర్యస్థైర్యములు, చేతికెముకయే లేదనిపించుకొనిన వదాన్యత, ఆలస్యమేయెఱుంగని యార్తత్రాణ పరాయణత్వము, తెంపిలేని భక్తిపారవశ్యము, ప్రాపంచికాలోచనమే యెఱుంగని స్వార్థత్యాగ సౌశీల్యముగల యార్యనాగరికత వేఱొండు నాగరికత వలన నేర్చుకొనవలసిన యంశములుకూడ నుండునా? అహంభావముచే అజ్ఞానముచే అధికారమదాంధతతో పాశ్చాత్త్యులు హైందవుల కిప్పుడేమో నేర్పుచున్నా మనుకొనుచున్నారు కాని నిజమారసినచో వారేవీరివలన గొన్నియింకను నేర్చుకొనవలసియున్నారన్న నతిశయోక్తి కాజాలదు. ఎటువచ్చినను నవీనములగు భౌతికశాస్త్రీయములకు యంత్రాదిసాధనములు ఆర్యులెఱుంగుదురాయని ప్రశ్నింపజూతురుకాబోలు? జగత్తులోని విజ్ఞానము మానవులందఱకు సమానహక్కుగా బరిగణింపవలసియున్నప్పుడు నిన్న నేడు సంపాదింపబడిన యావిజ్ఞానమున కార్యులకుమాత్రము హక్కులేదు? ఇంతకు నీవిజ్ఞానమంతయు నొక్కదినమున ఒకయాంగ్లేయునివలన సంపాదిం

పబడినదా? ఈప్రపంచకమునకంతకు ఈసంపాద నాక్రమమందు
కర్తృత్వముకలదు. మరియు జగత్తు భౌతికవిజ్ఞానములపై బ
ర్వలిదునప్పుడే హిందూదేశము ప్రాచీనస్వరాజ్యము గోల్పో
వుటలో బ్రతిఘటించుచుముందుప్రకరణమున వివరింపబడనున్న
మహాపతన సంఘర్షణమున దలముక్కలై తల్లడిల్లుచున్నప్పు
డిట్టి యీానసింపులకు తావెక్కడయున్నది? తారతమ్యము లెం
చవలసివచ్చినచో న్యాయముగ క్రీస్తుపుట్టుకతో పాశ్చాత్యు
ల యభివృద్ధిప్రారంభము హైందవుల పతనపూర్వకాధోగమ
న ప్రారంభము జర్గియుండుటచే వీరల నాగరికత లప్పటివఱకే
యెదుటవైచుకొని విమర్శింపవలయును. అట్టిచో నార్యులకు
పాశ్చాత్యులకు నెంతటి వ్యత్యాసమున్నదో సూక్ష్మముగ
గ్రహింపవచ్చును. రెండువేల సంవత్సరముల నిరంతర సంఘ
ర్షణమునబడి వేయిసంవత్సరముల ప్రవాహరూపక రక్తపాత
మునకులోనై యిప్పటికడుగంటినట్లు కనంబడుచున్న యార్య
నాగరికతయే పాశ్చాత్యనాగరికత కంటె ననేకవిధముల హె
చ్చుప్రతిభ కలదని ఋజువుచేయవచ్చును. రెండుదేశములనార
సిన ప్రముఖులెందఱో పాశ్చాత్యులు సహిత మీయభిప్రాయ
మునే వేనోళ్ళ జాటుచున్నారు. ప్రేరేపింపబడిన క్రోధపరవశు
లైన ప్రజాసమూహ మేనల్వురుదొరలనోహింసించిరను సా
కుతో బంగ్రాడెండునందలమంది స్త్రీపురుషాదుల నొకయావరణ



ములోనికి మిషపై రప్పించి నిరాయుధులైయున్నతరి సైనిక
నివహంబులచే ఫిరంగిగుండ్లు వదిలించి చంపించిన యమృతసరు
ఘోరముల నాటియాంగ్లేయుల నాగరికత యెంతటి పశుప్రా
యమైయున్నదో లోకమెఱింగియేయున్నది. అట్టికోపకారణ
ము తటస్థించినను హిందూదేశమంతయు శాంతిబద్ధమైయుం
డుటయేకాక హంతకుని యుద్యోగహరణముతో మాత్రమే
తృప్తిపడగలమన్న నేటిహైందవుల నైతికసంపత్తి యెట్టిదో
యాలోకమే తెలిసికొన్నది. ఇట్టివిమర్శనమింక విరమింపబడు
గాక కావున ఆర్యనాగరికత ఆద్యంతములందు వెంటనొకతీరు
న నుత్కృష్టమై సార్థకమై తేజరిల్లుచున్నదనుట నిర్వివాదాం
శము.

ఇక హైందవులందఱొక్క జాతీయతా బద్ధులుకారని
యాంగ్లేయులలో గొందఱు కొందలమందుచున్న విషయము
లో నెంతవఱకు సత్యమున్నదో గమనింపవలసినదే! జాతీయ
తా నిర్వచన మాపాశ్చాత్యు లేయొనర్చియున్నారుకదా! ఒక
యాదర్శము, ఒకదేశము, ఒకచరిత్ర, ఒకమతము, ఒకరా
జ్యము ఒకభాష ఒకవిధమగు సాంఘికనైతిక సంపత్తియు
గల ప్రజలకు జాతీయతా నిర్వచనము? ఉత్తరమునగల పెట్టని
కోటలగు హిమాలయపర్వతపంక్తి హిందూదేశమును ఆసి
యాఖండమునుండి వేఱుపఱచి యొకదేశముక్రింద సంరక్షిం

చుచుండుటలేదా? తూర్పు, దక్షిణము, పశ్చిమము నాక్రమించిన బంగాళాఖాతము. హిందూమహాసముద్రము అరేబియా మహాసముద్రమును హిందూదేశమనాదినుండియు దమయొడిలో నిడుకొని యేకదేశ ప్రతిపాదకత్వము నిర్వహింపలేకపోవుచున్నవా! ఇట్టిహద్దుల మధ్యస్థమైన హిందూదేశము ఒకజాతి నివసించుట కర్హతలేనిదని నుడువుటకంటె వేఱసాహసముండజాలదు. అనాదినుండియు నలరారుచుండిన దేశమగుటచే ననేక జాతులవారిందు బ్రవేసించి నివాస మొనర్చుకొన్నారన్నది వాస్తవమే! కాని యట్టివారలందఱు మహాప్రవాహమగు ఆర్యజాతిలో కాలవశమున గలసిపోయినట్లు స్పష్టముగా దెలియుటలేదా? ఆర్యవిజ్ఞానము నాగరికత మిగతజాతుల దిగమ్రింగి తన యౌత్కృష్ట్యము ప్రకటించుకొనగల్గినట్లు దేశములోని భాషలగాంచినను మత సాంప్రదాయము పరికించినను మనకు బోధపడగలదు. దేశములోగల యిప్పటిభాషలన్నియు సంస్కృతమునకు లొంగి సలాములొనర్చి తమవ్యక్తిత్వము కూడ జంపుకొని సమస్తవస్తువులకు వ్యవహారములకు సంస్కృతపదములే వాడుకొనుచున్నవికాదా! ద్రావిడమగు మనయాంధ్రభాష తమకు ఆర్యభాషయగు సంస్కృతమునుండియే పుట్టినదనుకొనునంతటి భ్రమ గొల్పుచుండుటలేదా? ఇట్టిదేశమునంగల ప్రతిభాషయు సంస్కృత భవములనియే యిప్పుడు



నమ్మబడుచున్నవి. కావున నాయాభాషల యాదిమజాతులేనాడో యార్యులలో మిశ్రమైపోయినారు. ఇప్పుడు స్థూలసూక్ష్మ పరిశీలనము లన్నిటికి హైందవులెల్లరు ఆర్యులనియే గోచరింపకమానరు. ఏవోకొన్ని మతములుతప్ప దేశములో బుట్టిన మతములన్నియు వేదప్రమాణము శిరసావహించినవేకదా! వ్యతిరేకించిన బౌద్ధమతాదికములు సహితము లదివఱకు వైదికమత సాంప్రదాయములనుండియే ప్రతికూలభావముతో బయలుదేరినవి కాని విదేశీయములు విజాతీయములు నెన్నటికి నిగావు. అత్యంత ప్రాచీనమైన యార్యమతము సాంప్రదాయము భాష సాంఘిక వ్యవహారములు పూర్వచరిత్ర రాజ్యాంగవిధానము సమస్తవిషయముల స్వీకరించియేనాడో భారతభూమికి దయచేసిన వివిధజాతులన్నియు తమతమ ప్రత్యేకవ్యక్తిత్వముల విస్మరించి హైందవజాతిగా బరిణమించినదని నిర్వివాదముగ జెప్పవచ్చును.

ఇంతయేల! మొన్న మొన్న లాగున గనంబడుచున్న మహమ్మదీయ ప్రవేశ మీనాటికేమైనది? మహమ్మదీయ ప్రవిష్టులు నేడేడుకోట్లున్నను వారెల్లరు హైందవజాతిలో నిమిడిపోవలసివచ్చినదికాదా? దేశములో నదివఱకుగల యంతసహస్రములో దానొకటియై మహమ్మదీయమతము బ్రతికియుండును గాక జాతిమాత్రము హైందవజాతిలో నంతర్లీనమైపోక

తప్పదుకదా! నిజముచేతగూడ నీయేమకోట్ల మహమ్మదీయులలోను నొకలక్ష కుటుంబములైన విదేశీగతులుందురా? మిగత సంఖ్యయంతయు బూర్వము పూర్వపుహైందవులేకదా? ఏవోకొన్ని మతసాంప్రదాయములలో భేదించినను వీరెల్లరు హైందవులేయనుకొనుట కాక్షేపణ మెంతమాత్రము కనబడదు. ఇంతయెందులకు నిప్పుడిప్పుడే దేశములో నివాసమేర్పఱచుకొనుచున్న యాంగ్లేయాదుల గతియేమి? వీరును గాలక్రమమున హైందవజాతిలో నిమిడిపోవలసినదే! వారిరాక నవీనమగుటచేనింక పూర్వవాసనలతో నల్లాడుచున్నారుకానిమఱియు వారిస్వజాతీయులేయిప్పటిప్రభుత్వాధికారులౌటచేనింకను రాజకుటుంబీకులమనుకొని యొకవిధమగు గర్వముతో నున్నారు కాని వీరలింక నీదేశమునుండి యెన్నటికిని బోజాలరు. వారి స్వదేశములు వీరిని స్వీకరించి గౌరవింపవు. మనదేశీయులనెల్లర పూర్వార్యులవలె వీరు డిగమ్రింగజాలరు. ఇంకవీరు కిక్కురుమనకుండ గొన్నినాళ్ళకే హైందవజాతిలో నొకభాగమై మెలంగితీరెదరు. కావున నిట్టిపరిస్థితులలో హైందవజాతియంతయు నొక జాతీయతతో బ్రకాశింపజాలదనుకొనుట వట్టిభ్రమ. హైందవజాతీయత జలప్రళయానంతరము కొన్నినాళ్లకే ప్రతిష్ఠింపబడినది. నేటివఱ కవిచ్ఛిన్నముగా గొప్పచరిత్రతో గాలానంతప్రవాహమున నీదుకొని వచ్చుచున్నది. తోడిప్రా



చీనజాతీయతలన్నియు నీమహాకాల సముద్రమున మునిగిపోయి నశియించియుండ నొక యార్యజాతీయతయే హిందూదేశమున నెన్నో పరివర్తనములను చెక్కుచెదరక బ్రదుకుచున్నది. కావున హైందవజాతి పదివేల సంవత్సరములనుండి నిరంతరసౌభాగ్య గరిమతో జగజ్జేగీయమానమై యనేకజాతుల తనపాట్లబెట్టుకొని యరణ్యమునందు బ్రతికిన మహాసాగరమువలె పాలచి నిలిచియున్నది. స్వార్థపరులైన యాంగ్లేయులేమియన్నను అనుకొనవచ్చును. మనకుమాత్రము నిర్భయము ముండవలసిన యవసరములేదు. కావున నోపాఠకాగ్రణీ! స్వార్థపరుడై యాంగ్లేయుడంటశాశ్వతనైరంకుశ్యము నెలాయింపనభిలాషతో మనకునేర్పిన యీసంశయముల విడనాడి యొక్కసారి నీయోచనామార్గమున దివ్యదర్శనముగ గన్నులపండువగునట్లు కనంబడుచున్న మన పూర్వచరిత్ర వైభవము తిలకించి ధన్యుడవు కమ్ము! ఇప్పటి దుర్భరదరిద్రదాస్యశృంఖలస్థితి కొంకించుక పూర్వమే నీస్వీయరాజ్యవైభవము వెలుగొంది కనంబడుచున్నది. ఇంకను గొంచెముదూరమునకుబోయినను నదియేరెట్టించిన మహాతేజస్సు ప్రసరింపగల్గుచున్నది. ఇంకను పోవుచో నీతాతముత్తాత లనుభవించిన నాగరికత యైశ్వర్యము స్వాతంత్ర్యము చూడగొనగలవు. నీదృష్టియింకను గొంచెముకొంచెముదూర పూర్వమునకు బోవంబోవ నీకన్నులు మిఱుమిట్లుగొల్పుచు

ననాదిలో నంతర్హితమై యులహారిన నీపూర్వచరిత్రస్మరించి నమస్కరించి ధన్యుడవుకా గలవు! యింతటిమహానునపూర్వము గల నీవు నేడిట్టి దుస్థితికెట్లువచ్చితివో యిదియంతయు స్వప్నప్రాయమేయని భ్రమపడవలెను. దీనికంతకు గారణములేక పోలేదు. భగవత్సృష్టిలో గారణములేనిదే కార్యము జనింపజాలదు. కార్యమెుక్కనిమేషమైనను మఱియొక కార్యమునకు గారణము గాకుండ నిలువజాలదు. ఈకార్యకారణ ప్రణాళికయే ముందు ప్రకరణమునందు వివరింపబడును.

# అధఃపతనక్రమము

పదివేలసంవత్సరములవిచ్ఛిన్నముగ జగజ్జేగీయమానముగ బ్రకాశించిన మన హైందవస్వారాజ్యలక్ష్మి యెట్లు తన యధఃపతనక్రమము నడిపించినదో యెఱుంగుట మన భావికర్తవ్యమునకు ముఖ్యావసరమైన విషయము. క్రీస్తు పుట్టకపూర్వము 600 సంవత్సరములకు బ్రితమే మన దేశములో గౌతమబుద్ధు డవతరించి తన బౌద్ధమతమును బ్రతిష్ఠించెను. ఆతనిమతమునందుగల ప్రధానాంశములు రెండు. వైదిక కర్మానుష్ఠాననిరసనము. అహింసా ప్రతిపాదనమును, తాత్వికవిషయమై



నిరసనము, అహింసాప్రతిపాదనము, తాత్వికవిషయమై యీతని మతము వేదకాలమునాటి తాత్వికప్రణాళికలలో నేదో యొకదానితో సంబంధింపకపోలేదు. ఈబౌద్ధమత ప్రచారము దేశములో విరివిగా నాకాలమున జరుగుటలో నొక మహోపరివర్తనముద్భవిల్లినది. అంతవఱకు దేశములో మతవిషయకమైన కక్షులులేవు. తాత్వికాభిప్రాయ భేదము లెన్నియున్నను నయ్యవన్నియు నిరంతర సౌందర్యముతో నేకమాతృకయగు వేదమునాశ్రయించి ప్రజలు బ్రదుకుచుండెడివారు. ఇయ్యవిప్రభవిల్లినది మొదలు దేశములో నట్లుగాక వైదికమతములనియు దత్వ్యతిరేకములనియు రెండుభాగములుగా జీలిపోయి యన్యోన్యకక్షుల కారంభమైనవి. కొలదికాలములోనే జైనమతముపుట్టినది. ఈమతముల మంచిచెడ్డలతో మనకు బనిలేదు. ఇయ్యది ప్రభవిల్లుట కారణముగా దేశములో బయల్దేరిన ద్వైధీభావము మనకు ముఖ్యమైనవిషయము. ఈభారతవర్షములో యిదివరకుండిన యైకమత్యసౌష్ఠవముయొక్క పునాదులానాడే కదలుట కారంభించినవి. మానవహృదయమునందు సద్గుణాకర్షముకంటె దుర్గుణవ్యామోహమే యెక్కుడుండగలదని తజ్ఞులయభిప్రాయము. సద్గుణము నిలబెట్టుకొనుటకు జీవింతో యింద్రియ నిగ్రహమొనర్పవలెనుగాని దుర్గుణావలంబనమున కొక్కసారి మనసులో దావిచ్చినజాలును. కావున గక్ష

యు మత్సరము దేశములో నేకారణముచేతనైన మొలకయె త్తిన దనగనే వానితో సమస్తముచెడిపోవనమానదు. అక్కడ కు దేశములో నదివరకు బాదుకొనియున్న నైతికవిశ్రాంతిన లన నట్టిసద్గుణములు విదేశములలోవలె సంతసులభముగ బ్రాకి గొప్పవిప్లవములకు శీఘ్రగాములుగా లేకపోయినవని చెప్ప వచ్చును. మొత్తముమీద దేశములో ననైకమత్యమునకు దావు దొరకినది. అంతటితో గాలక్రమమున నెక్కడి సామంతుడక్కడ స్వతంత్రుడై సామ్రాజ్య బలముతగ్గించుటయేకాక యేమాత్రము సావకాశమున్నను దానే సామ్రాట్టుకావలెనను దురాశప్రబలజొచ్చినది. కావుననొకప్పుడు పాటలీపుత్రము మఱొకప్పుడు ఢిల్లీపట్టణము, నింకొకప్పుడుజ్జయినీ వేఱొకప్పుడు వేఱొకపట్టణము దేశమునకంతకు రాజధానులు కాజొచ్చినవి. సామ్రాజ్యములు చిన్నచిన్నవికాజొచ్చినవి- ఒక్కింత కాలములోనే రాజవంశములు మారజొచ్చినవి- యుద్ధములు తఱచైనవి- మారణకర్మము పెచ్చుపెరిగినది- స్వారాజ్యలక్ష్మి భిన్నభిన్నమై యధఃపతనమార్గము పట్టినది.

వేదసాంప్రదాయములో నేటివరకు వ్రేలాడుచున్న ప్రజలలో జీవితము నిర్జీవితమైన తాంత్రికపద్ధతిబట్టినది. దినములోగల యిరువదినాల్గు గంటలు నఱువది ఘడియలు స్మృత్యుక్తమో శ్రుత్యుక్తమో నిత్యమో నైమిత్తికమో కర్మా



నుష్ఠానమునకు వెచ్చింపబడవలసివచ్చినది. దృష్టియంతయు నూర్ధ్వగామియై క్రిందివాక్యము కనంబడుటయే మానివైచినది. ఇంతకు ఆయదన్నం ప్రయచ్ఛతియను లోకోక్తి పుట్టుటకవకాశము చిక్కిన భారతభూమిలోగల సస్యసమృద్ధి సకాలవర్షము సకలైశ్వర్య సంపూర్తి ప్రజలకెల్లర కలసత్వము చించి వైచినది. ముప్పదిమూడుకోట్ల ప్రజలకు కూడుగుడ్డ గృహము కొరతలేకుండ నుండుటచే నిక వారిదృష్టియెల్లప్పుడు పారలౌకిక ప్రవృత్తిగోబడి మహోన్నత వేదాంత మహదాకాశమునందే సంచరింపదొడంగినది. ఐహికాముష్మికములు రెండునొక్క తక్కిడ చిప్పలను పూర్వాభిప్రాయము నశించి యాముష్మికమే ప్రధానగతి కవలంబనీయమై యందువలన వైరాగ్య ముద్భవిల్లినది. ఈవైరాగ్యము ప్రక్రమాభంగమొనర్చి యవస్థా మర్యాదమీఱి హద్దులేనిదై జగత్తునంతను మిథ్యగ నొనర్చి ప్రజలలో ప్రముఖులనెల్లర మహారణ్యములకు బాఱదోల మొదలుపెట్టినది- దీనితో బ్రజలలో ఉపేక్షాభావము ప్రబలి నేటివఱకు మానవజీవితములోని సౌందర్యము నంతను బుద్బుదప్రాయమొనర్చి విచ్ఛిన్నముచేసినదని తజ్ఞుల యభిప్రాయము.

ఈపరిస్థితులన్నియు నొక్కదినములో బరిపూర్ణము కాలేదు. బౌద్ధమతప్రవేశము మొదలు మహమ్మదు గజనీ దండ

యాత్రలవఱకు నున్న పదునేనువందల సంవత్సరకాలమును ప్రసరించి మిక్కిలి యలసగమనముతో వ్యాపించినదని యెఱుంగవలెను. ఈమహాకాలములో దేశములో నెన్నో పరివర్తనములు జరిగినవి. మతవిషయికమైన సందర్భములో శంకరుడు పుట్టినాడు. రామానుజుడవతరించినాడు. మధ్వాచారి జనించినాడు. ఇంక నెందఱో మతప్రవర్తకులు ప్రభవిల్లినారు. ఈమతములన్నియు ఒకేవిధముగా మహోపకారము దేశమున కొనర్చినవని యప్పటితరములవారే కాక యెప్పటివారును చేతులు జోడించి నమస్కరింపక తప్పరు. వీరిలో నొక్కొక్కరును జగంబునకంతకు నెన్నోవిధముల మార్గదర్శకులైరి. వీరిసాంప్రదాయములు చిరస్థాయులై లోకమున వెలుంగకమానవు. వీరునిర్వచించిన వేదాంత తాత్విక రహస్యములు భారతభూమి కమూల్యాలంకారమేయగును. ఈవిషయమున ప్రపంచమంతయు భారతభూమికాళ్ళకడ శుశ్రూషయొనర్చి యెన్నోసంగతులు నేర్చుకొనవలసియే యున్నది. ఇది కాదని యేమూర్ఖుడు నుద్రోసివేయజాలడు. కానియీ ఈమతముల పరిక్రాంత రాజకీయముగ దేశమున కెట్లు పరిణమించినదో చూపదలచుకొన్న చరిత్రకారుడు మోమోటమి విడిచి చెప్పవలసిన సత్యము లేవియన, శంకరుని వైరాగ్యమును రామానుజ మతాచార్యులభక్తి ప్రపత్తులో దేశములో గొ



ప్ప యుపేక్షాభావము అపూర్వస్వార్థపరత్వము పెంపొందించినవని చెప్పకతప్పదు. తమకును దనదేవునకును సంబంధము సూటిగవైచుకొని ప్రక్కనుంగల బిడ్డలతో సహితము సంపర్కము వదలుకొన నిచ్చగించుటకు నేర్పిన యీమతములువారును వీరినెల్లర ముక్తులరక్తుల భగవద్భక్తుల చేయగల్గినవో లేదో కాని దేశ రాజకీయార్థములందు విముఖులుగామాత్రము చేయగల్గినవి. ఇందులకొక్క తార్కాణము చూడుడు. భారతాంతర్గత భగవద్గీతకు వీరుమువ్వురు భాష్యములువ్రాసిరి. వీరుమువ్వురు భగవద్గీత పరమప్రమాణముగా శిరసావహించెదరు. భగవద్గీత మహాభారతయుద్ధ ప్రారంభమున గౌంతేయుడగు నర్జునుడు జగదేకవీరుడయ్యు దనపక్షము ధర్మబద్ధమని యెఱింగియు తన ప్రతిపక్షులు లోకకంటకులని తెలిసికొనియు యుద్ధభూమికి వచ్చినతోడనే ధర్మసందేహము కలవాడై యుద్ధముచేయుటయా యడవుల దపస్సుచేసికొనుటయా యనుసంశయంబొంది బాధపడుచుండు సమయమున శ్రీకృష్ణుడుగురువై యాభగవద్గీత యుపదేశించి యుపక్రమోప సంహారములందు మధ్యమధ్య యర్జునుని స్వధర్మముగను లౌకిక కర్తవ్యమును నగు యుద్ధమే చేయవలెనని బోధించిబోధించి ప్రస్తావన వశమున ననేక వేదాంతరహస్యములుకూడ వెలిబుచ్చి యాతని

యుద్ధసన్నద్ధు నొనర్చుటకై చెప్పిన భగవద్గీత గదా యది! అట్టిదానిని వీరు మువ్వురు భక్తిజ్ఞానవైరాగ్యములతో ప్రధానములుగ నొనర్చుకొని స్వధర్మ నిర్వహణమను కర్మపదార్థమును మరుగుపరిచివైచిరి. అంతటినుండి భగవద్గీత ప్రబల స్వధర్మ నిర్వహణధూర్వహులుగ బురికొల్పుటకు మాఱు ప్రపంచకమునుండి విముఖులుగాc నిరాకరింప మొదలుపెట్టినది. ఇట్టి పరాకర్షణ మూలముననే భారతభూమిలో గ్రీకులు వచ్చినను పఠానులు వచ్చినను తురకలేతెంచినను మొగలులు దిగినను ప్రజాసామాన్యము పోయిగ దమసహజప్రవృత్తులతో జెక్కు చెదరకుండ నుండగల్గిరి. ఎటువచ్చినను రాజకీయసంపర్కము వదలుకొనజాలని రాజపుత్రులు - క్షత్రియులు నిట్టి వ్యామోహములోబడని వివేకులుమాత్రమే భారతస్వరాజ్యలక్ష్మియధఃపతన క్రమమునకు సాధ్యమైనంతవట్టు ప్రతిఘటించి పూర్వాపరాక్రమ ధైర్యస్థైర్యముల గనcబఱచుచు వచ్చిరి.

ఇట్లగుటచే భారతకులు మూడుమతములు దేశమునకు మహానర్థకములయినవని మాత్రము భ్రమపడగూడదు. స్వరాజ్యపతనమహాభూతము వీటనిగూడ జేజిక్కించుకొని యిట్లు దేశము నధోగతిలోనికి లాగుకొనిపోయినదని గ్రహింపనగును. దైవసంకల్ప మిట్లుండకపోయినయెడల సర్వంఖల్విదం బ్రహ్మైకమేవాద్వితీయం బ్రహ్మ సోహం బ్రహ్మయను మహా సూత్రము



లపై సాధారణమైన యద్వైతమతము న్యాయముగా దేశప్రజలలో సర్వసాభ్రాతృత్వము సర్వసమానత్వము స్వార్థత్యాగము పురికొల్పవలసియుండ, స్వార్థపరత్వము పరబాధాసహిష్ణుత్వము లోకానేకవిభాగము పుణ్యపాప నిర్భయత్వము గల్పించి దేశము నాశన మొనర్చునా? మహాకాలచక్రముయొక్క సహజపరివర్తనము వలన గలుగకతప్పదని యధోగమనమే యిది కానియెడల సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ యను మొదలగు మహావాక్యముల నాధారముగా జేసికొన్న విశిష్టాద్వైత ద్వైతములు దేశములో న్యాయముగా గర్వశూన్యత్వ, అహంభావరాహిత్యము స్వార్థత్యాగము, ఇంద్రియసమ్మోహనా నిరసనము సర్వసౌభ్రాతృత్వము ప్రజలకు నేర్పుటమాఱు కించిజ్ఞత్వము, స్వాయన్నిరసనము, కలిగించి యధోగతిబట్టించునా? కావున నిది యంతయు గాలవిపర్యము కాని మతములు కావు. ఒకనికంచికైన జెట్టుకైన ననంతకోటి కారణములుండితీరును. అట్టివన్నియు నెఱ్ఱించుకొనలేక, మానవుడు సాధారణముగా దైవమే యన్నిటికిని మూలకారణమని యొక నమస్కారమొనర్చి యీ వితర్కమునుండి విముక్తుడగుచుండును. అంతమాత్రముచేత పురుషకారమునకు ప్రసక్తిపోజాలదు. ఒక్కవిధముగ జూచినచో పురుషకారములోని పరిపూర్ణత్వమే దైవికమునికూడ జెప్పవచ్చును.

కావుననే వీనినన్నిటికి సమన్వయరూపముగ భగవద్గీతలో “యోగస్త్వంకురు కర్మాణిసంగంత్యక్త్వా ధనంబులు, మొదలగువాక్యములచే ఫలితాభినంది పొందకుండ నీవిధిని నీవు నిర్వహింపు మనిస్పష్టముగా బోధింపబడియున్నది. కాని కాలవశమున మనదేశములో నిట్టి పరమార్థములన్నియు దలక్రిందులై నిజమైన మతాభినివేశము నశించి వెఱ్ఱితలలువైచి యంతయు దైవముదేభారమనుకొని యాతని బ్రార్థించుట తప్ప మఱియేప్రయత్నమునకు బూనకుండ నిట్టి బురోగమనము పురికొల్పబడినది. ఇంతకును పదివేల సంవత్సరములు స్వరాజ్యమనుభవింపనిచ్చిన నిజమతము చిరకాలమునుండి యుండుటచే గాబోలు వెఱ్ఱితలలువేసి భజనకలు మొలచి విరుగుడుజూపి తన సౌష్టవము చెఱచుకొన్నది.

ఇదియిట్లుండ సాంఘిక సంస్థలుగా బ్రతిష్ఠింపబడిన వర్ణవిభాగములు అన్యోన్యాధఃకరణములకై తావిచ్చినవి. ప్రత్యేకవ్యక్తిత్వములు ప్రబలి చిన్నప్రవృత్తులు రేకెత్త మొదలిడినవి. దీనితో అహమహమికలు అహంభావములు అహంకారములు పెచ్చుపెరిగి ప్రాచీనసౌష్టవము పోగొట్టుకొని “యెవరికివారే యమునాతీరే” యన్నట్లు అనైకమత్య ద్యోతకములైనవి. అంతటినుండి యెవరివర్ణమును వారు అగ్రగణ్యముగ గాపాడుకొందుమను దురూహాగల్గి యొండొరులతో నడవలఱుగల



సంబంధబాంధవ్యములు దెగగొట్టుకొని యింకనుభిన్నభిన్నలులై దేశకాలములనులోనై యనేక శకలములైపోయినవి. కావున స్వరాజ్యాధఃపతనమునకు గారణమగు యనైకమత్యమహావిషప్రయోగముతో వర్ణవిభాగములుకూడ దుదకుంగొంత కర్తృత్వము పంచుకొనగల్గినవి. కాని యెంత యనైకమత్యద్యోతకములైనను వర్ణవిభాగములు వానినను సరించి నిర్మింపబడుచువచ్చిన పంచాయితులువర్గములు సభలే హైందవస్వరాజ్యమును హైందవజాతిని నేటివఱకు నిలబెట్టగల్గినవనుటమాత్రము మనమెన్నడును మఱువరాదు. కావున దక్షులెప్పుడును ఒకవస్తువునందే యొకకార్యమువలననే మంచిచెడ్డలు రెండును బట్టి యొకదానికొకటి పెనవైచుకొని బ్రదుకుచున్నవని చెప్పుచుందురు. శొంఠి విరేచనకారియగుటయు సజీర్ణహారియగుటయు నొక్కప్పుడేయని మనమెఱుంగవలెను. వర్ణవిభాగములే స్వరాజ్యలక్ష్మి కాదిపీఠములై యవియే యధోగమనమునకు మార్గము చూపుటలో బాల్గొనుటయు నట్టిదేయని తెలిసికొనదగును.

మతసాంఘిక వ్యవస్థలట్లు తమవంతు నెఱపుటకు సంసిద్ధముకాగా భావపరిణామముసహిత మొక చిత్రపరిస్థితి పట్టినది. ఆదియందు లేపకాలములో మానవుడు ప్రయత్నించి యత్యధికాభివృద్ధి కవకాశమున్నదని గ్రహించియున్నదాని నభి

వృద్ధి పఱచుకొనుటయు లేనిదానికై యథాశక్తి ప్రయత్నిం
చుటయు జరిగి యంతటి నాగరికత, విజ్ఞానప్రకాశము సంపాదిం
పగల్గెను. కాని యభివృద్ధియే యధికమైనచో నలసత్వము పెం
చునట్లును, అన్నమే యత్యధికమైనచో నజీర్ణకారియగునట్ల
ట్లు, కావలసినదానికంటె నన్నిట నెక్కుడుండిన హేతువున
హిందూదేశములో బ్రజలు అలసస్వభావులై తల బిరుసెక్కి
క్రమముగా మైమఱపుగ్రమ్మి తమ్ముదాము మఱచి యొక క్రొత్త
ఘంతలోబడిరి. అది యేమియని వేఱ వెదుకనక్కరలేదు. మా
నవుడు సృష్టిలోనే భగవంతునిచే సమస్త విజ్ఞానము ప్రసాదింప
బడినాడనియు నింక నభివృద్ధికి చోటులేదనియు నొక దురూహ
లో బ్రజలలో బ్రముఖులే పడజొచ్చిరి. కనుకనే శాబ్దికమగు
వేదప్రమాణమే ప్రత్యక్షముకంటెను పరమగణ్యమై రాజ్య
మొనర్చినది. దీనితో దాత్కాలిక మానవుడు కించిజ్ఞుడై వ్య
ర్థుడై స్వోత్ప్రేక్షావిషయము స్వతస్స్వీయముగజూచుట కర్హు
డుగాకపోయినాడు. ఇంతటితో శాస్త్రములకు పరిశ్రమలకు
మింక విజ్ఞానపరివృద్ధికి స్వస్తి చెప్పి చేతులుముడిచికొని భారత
మాత పాతపాత్రములతో వ్రాతసుద్దులలో వ్రాతపరికర
ములతో బ్రతుకులాడవలసి వచ్చినది. ఇక్కడనే పాశ్చాత్త్యుల
కు మనప్రాచ్యులకుగల గొప్ప వ్యత్యాసము. వారి మతసాం
ప్రదాయముల ననుసరించి వారి యాదిమదంపతులగు ఆదా



మవ్వలు కేవల ముగ్ధులగు అడవి నివాసులు. మన ప్రాచీనమత
సాంప్రదాయముల ననుసరించి మన పురాణదంపతులు సర్వ
జ్ఞులు, సర్వాంతర్యాములు సర్వశక్తివంతులు ముగ్గురుభగవంతు
లే; ముగ్ధత్వమునుండి పాశ్చాత్త్యమానవుడు నేటివఱకు సమస్త
విధముల విజ్ఞానమొనర్పహక్కు నవకాశముకలిగి పాటుపడి
సంపాదించుకొనుచున్నాడు. మన దేశీయులు పూర్వము ఋషీ
శ్వరులకు భగవంతునిచే నీబడినదేదోదానితో దృప్తిపడి యిక
నొకయడుగైన ముందునకు వేయజాలమని భీష్మించుకొని
కూర్చున్నారు. ఒకవేళ నెవ్వడైన నేశాస్త్రవిషయమునందైన
న వేసినాడో వానిని వేయివిధముల మాడ్చి మఱి బ్రదుకని
చ్చినాము కాము. కావున నిట్టి కించిజ్ఞత్వ భావపరిణామముకూ
డ మన భారతస్వరాజ్యాధఃపతనమున కొక చేయూతయిచ్చిన
దని చెప్పవచ్చును. ఇయ్యది సమస్తవిధములగూడ బాధించి
నట్లు స్పష్టముగ రెండువేల సంవత్సరములనాటి పరికరములు
కత్తి, కఠారి, కొడవలి, నాగలి, రాటము మగ్గము మొదలగు
నవి పరిశీలించి యిప్పుడు దేశములోగల నాపనుల కుపయో
గించు పరికరములనే పరికించినచో నయ్యవేయివియనియు నొ
క్క యణుమాత్రమైన నభివృద్ధికాని మనము పొందనీయలేద
నియు దెలిసికొనగలము.

ఇంతకువట్టిపోవుటయే యెఱుంగక యెల్లప్పుడు కుంభవృష్టిగ సుధామధురఫలములపారముగ గురియుకామధేనువగు భారతమాత గర్భవాసమున జనించినాముగనుక నెన్నియుగములు మనము తూష్ణీంభావముతో స్వయంకృషి మానినను బుష్కలముగ బొట్టనిండ నింతకూడు నొడలనిండ నింతగుడ్డ చాలికి బ్రదుక గల్గినాము గాని యితరదేశములలోని ప్రజలే యిట్లు చేతులుముడిచి యొకశతాబ్దము కూర్చున్నచో నామరూపములు లేకుండ మాసిపోయియుందురు. ప్రారంభములో మన లోపము కనంబడనేలేదు కానిజగత్తుయావత్తు తాంత్రికాభ్యుదయ పరంపరలో హెచ్చుపెరిగి మనపైకి దండెత్తివచ్చుచున్న యీనాడు దానిఫల మనుభవించుచున్నాము.

పాఠకాగ్రణీ చిత్తగించితివా? మనస్వరాజ్యలక్ష్మి తనయధఃపతన క్రమములో నెట్లు క్రమక్రమాగత మాంగళ్యశూన్యత్వ మందుచున్నదో! మతసాంఘిక మానసిక పరిణామములలో బతనకారణములెట్లు పొడసూపుచుండ నింక రాజకీయ రంగములో నెట్టి సంఘర్షణము పుట్టినదో యొకింత స్వరాజ్యయుద్ధము లెన్నెన్నిసారులు రక్తపువెల్లువలు పాఱించి దేశ మాతృభూతారుణ దీప్తిగావించినవో మనము చూడవలసియున్నది.



క్రీస్తుపుట్టుకపూర్వము 326 వ సంవత్సర ప్రారంభమున గ్రీకుచక్రవర్తియగు అలెగ్జాండరు గొప్పసైన్యముతో దండెత్తివచ్చి సింధునదినిదాటి పాంచాలములో బ్రవేశించినాడు. తక్షశిలాపట్టణమునగల యొకసామంతుడు స్పర్ధకలవాడై పురుషోత్తమునిపయి నలెగ్జాండరు దండెత్తుటకు దగిన సహాయ సంపత్తులొనర్చివైచినాడు. జీలము చీనాబ్ నదుల మధ్యగల రాజ్యమును బరిపాలించుచున్న పురుషోత్తముడు అనేకరాజపుత్రవీరుల బ్రోగుచేసికొని సమరసన్నాహమొనర్చి ప్రతిఘటింప నిలబడెను. అలెగ్జాండరు క్రమముగా గుయుక్తులబన్ని జీలమ్నదిదాటి పురుషోత్తము నోడింపగల్గినాడు. ఈయుద్ధమే ప్రథమస్వరాజ్యయుద్ధమని చెప్పవచ్చును. ఇందు బురుషోత్తముడోడిపోవుటకు బ్రధానకారణము తక్షశిలా సామంతుడగు నొకకవిభీషణు డలెగ్జాండరుతో గలియుటయేయని వేఱుగ జెప్పనక్కరలేదు. ఈయోటమితో భారతభూమిపై విదేశీయుల రాజ్యప్రతిష్ఠాపన నుపక్రమింపబడినది. అలెగ్జాండరు పురుషోత్తముని తనసామంతునిగా గ్రహించి యాతని రాజ్యమాతనికిచ్చి కొంత గ్రీకుసైన్యము సహితము రక్షణార్థమటనుంచి తాను వెడలిపోయెను.

అట్లు గ్రీకుచక్రవర్తి కొంతసామ్రాజ్యమిట బ్రతిష్ఠించి తాను వెడలిన కొలదిసంవత్సరములకే పురుషోత్తము

ఇట్లు దేశములెల్లెడల ననేకవంశములు రాజ్యములు బయలుదేరి యొక్కొక్కప్పు డొక్కొక్కవంశము ప్రాముఖ్యము వహించుటయు నింకనవి యడుగంటుటయు మఱియొక్కొక్కపు దేశమునకంతకు ననేకచ్ఛత్రాధిపతియగుచుండుట జరుగుచు నిరంతర పరిణామములతో గాలము ముక్కలియొడుదుడుకుగా దొర్లజొచ్చినవి. సంగవంశము తరువాత కణ్వవంశము దానితరువాత నాంధ్రవంశము మరల గుప్తవంశము వచ్చుట పోవుట జరుగుటలోనే పుష్యమిత్రునివలెనే కొంతకాలమునకు చంద్రగుప్తుడు విక్రమాదిత్యుడు బాలాదిత్యుడు నిట్లనేకులు ఆయాకాలములందు జక్రవర్తులగుటయు దటస్థించుచు వచ్చినది. ఈకాలములోనే యుత్తరమునుండి విదేశీయులగు హూణులు తురేనియనులు బాక్ట్రియనులు మొదలగుజాతులని పాంచాలదేశములపై దండెత్తి జయింపగల్గినప్పుడెల్ల కొద్దిరాజ్యముల బ్రతిష్ఠించుకొని మరల నేచక్రవర్తికాలములో నోయోడి హైందవస్వరాజ్యలక్ష్మికి లొంగిపోయి కాలానుసరణమైన యొడిదుడుకుల బడుచువచ్చిరి.

ఈకాలముననే చైనానుండి ఫాయిహాను హ్యూనుత్సాంగులను నిద్దరు రాయబారులు దయచేసి హిందుదేశ సంచారములొనర్చి తమయనుభవముల విశదకరించుచు నప్పటికిని హైందవుల వైభవము మహోత్తమదశయందుండుచున్నదని సాక్ష్యమిచ్చుచున్నారు.



ఇట్టియంతఃకలహములతో నస్థిరరాజ్యములతో ననవరత రక్తపాతములతో నేడుశతాబ్దములు దొర్లినతరువాత క్రీ.శ. 710 వ సంవత్సరమున అరబ్బీసైన్యములు మహమ్మదు కాసీము అను సేనానిక్రింద ఖాలీపునలీదువలన బంపబడి సింధుదేశము దండెత్తినవి. ఇంతకు కొంతకాలముక్రిందటనే మహమ్మదుమతప్రవక్త యవతరించి యరేబియాప్రాంతములవారి నొకమతబంధముచే మహాపరివర్తనమునకు దెచ్చియున్నాడు. ఈమహమ్మదీయ మతములో నేదియెట్లున్నను విగ్రహారాధన లేకపోవుటయు దమమతమునకు వ్యతిరేకమైనదాని సర్వవిధములనాశనమొనర్పవలెనను కాంక్ష పురికొల్పబడుటయు మనహిందూదేశమునకు గొప్ప పరిణామకారణములైనవి. మహమ్మదీయమతస్థులైన సైన్యములు రాజ్యకాంక్షతో మనదేశములో బ్రవేశించుటకిదియే ప్రథమము. వారట్లు ప్రవేశించి యక్కడ రాజగు దాహిరుడనువాని సంహరించి సింధునదీ ముఖమంతయు నాక్రమించి యొక మహమ్మదీయరాజ్యము ప్రతిష్ఠింపబడినది. ఇట్టి మహమ్మదీయరాజ్య ప్రతిష్ఠాపనము రాజకీయముగ భారతస్వరాజ్య పతనప్రారంభ ముహూర్తమైనను నీరాజ్యపరాభవమునకు బగదీర్చుకొనుటకు చుట్టుపట్లగల హైందవులెల్లరు నెప్పటికప్పుడు విశేషప్రయత్నము లొనర్చి ప్రతిఘటించుచు వచ్చినను నొక్కవిధముగ హైందవ

నెఱింగినవా డగుటవలనను, నతఁడు అక్రమమున 17 సారులు ననేక ప్రదేశములపై గుఱిచూచి దండెత్తి యక్కడి హైందవ రాజుల నోడించి గ్రామముల బట్టణముల గొల్లగొట్టి దేవాలయముల నాశనమొనర్చి కుబేరనిధులకు దీసిపోని ద్రవ్యభాండారముల దొంగలించుకొని పోగల్గినాడు. స్థానేశ్వర మొకసారి, మధుర యింకొకసారి, కనోజి మఱొకతూరి, యిట్లు పదునేడు సారులు దేశమునకు పెనుభూతమువలె ఒకలక్ష గుఱ్ఱపుదళము, నిరువదివేల పదాతిసైన్యము ప్రోగుచేసికొని, బ్రహ్మాండముగ గొల్లగొట్టి భారతభూమిలోని యఖండైశ్వర్యములవారితముగ దమ దేశములకు గొంపోగల్గినాడు. ఆతని దండయాత్రలలో నాఖరుదియు నత్యంత ప్రాముఖ్యము వహింపగల్గినదియునగు సోమనాథపురపు దండయాత్ర మిక్కిలి దారుణప్రక్రియలో జరిగినది. ఈతని వెనుక దండయాత్రలకువలెనే యిందులకును భారతీయ రాజులెల్లరును నొండొరుల బురికొల్పుకొని వేదకాలమునుండియు మిక్కిలిపవిత్రమని పేరెన్నికగాంచినయీసోమనాథేశ్వర దేవాలయమురక్షింపబద్ధకంకణులై లక్షోపలక్షలుగా గుమిగూడిరి. ఆఖరుమానవుని ప్రాణమువదలువఱకు దేవాలయమును గాపాడుచునే యుండిరి. గజనీయిప్పుడు శుద్ధశూన్యముగ నా దేవాలయము నా రాజ్యము నాప్రాంతముల జేసి వైచి యనేకబారువులబంగారము ఎన్నోమణుగుల మణిస్థగిత



వస్తువులు గొంపోవుచు గసిదీరక యందు గల శివలింగమును సహితము పెల్లగించి గజనీమసీదులో ప్రథమసోపానముగా నమర్చుకొనుటకు బట్టించుకొనిపోయెను. భారతస్వారాజ్యలక్ష్మియింట దొంగలుదూరుట కిదియే ప్రథమము. ఇంతవఱకు సమస్తదేశములును భారతభూమికి రాజకీయముగ నజరానాలును వాణిజ్యరూపముగ శతసహస్ర స్వర్ణదీనారములును సమర్పించుచు ధన్యము లగుచుండెడివి. కాని కాలవశమున రానున్న యధఃపతన పరిసమాప్తికై యీకాలమున గజనీయను దోపిడిదొంగ ప్రవేశించి కొల్లగొట్టుట కవకాశము చిక్కినది. మతసంబంధమైన యావేశముతోనైననేమి రాజ్యకాంక్షతోనైననేమి యప్పటి హైందవరాజు లొండొరులబురికొల్పుకొని బ్రహ్మాండ ప్రతిఘటన మొనర్చి ప్రాణములు గోల్పోయియున్నారు. క్రీ. శ. 1030 సంవత్సరమున గజనీమహామ్మదు చనిపోయిన తరువాత మరల నొకవందసంవత్సరములుత్తరమునగల తుఱకరాజులు తమలోదాము గొంతుకలు కోసికొనుచుండుటచే భారతభూమి మరల కొంచెము తనస్వాతంత్ర్యమనుభవించుచునేయున్నది. గజనీవంశము నిర్మూలనమొనర్చి ఆఫ్ఘనుజాతీయుడగు మహమ్మదు గోరీయనునాతడు రాజ్యము ప్రతిష్ఠింపగల్గినాడు.

ఈతఁడు మరల ఢిల్లీసామ్రాజ్యముపై దండెత్తివచ్చెను కాని యప్పుడక్కడ రాజమహేంద్రుడగు పృథ్వీరాజు క్రీ. శ 1191 వ సంవత్సరమున నాతని తీవ్రముగ దలపడి యోడించి పాఱఁగొట్టెను. గోరీదెబ్బలతో బారిపోయి గాయములు మానినవెంటనే రోషోద్రేకముతో బృథ్వీరాజును జయించుటో యుద్ధరంగమున జచ్చుటో జరగింప బద్ధకంకణుడై గొప్పసైన్యముతయారుచేసికొని మరల దాడివెడలివచ్చెను. ఈసారియు బృథ్వీరాజు తనబంధువులను బావమరుదులు స్నేహితులు స్వకీయుల నెల్లరరావించి మహాసమర సన్నాహమొనర్చి యింతవఱకు జయమొసంగిన స్థానేశ్వరముకడనే యెదురునిలచియుండెను. ఇరుసైన్యములకు గొప్పయుద్ధము జరిగినది. రక్తకాలువలు పాఱినవి. మారణకర్మము చెలరేగినది. కాలవశమున బృథ్వీరాజు నాతనితోనున్న రాజపుత్రవీరులు దునుమట్టింపబడిరి. ఢిల్లీకోట యొకసంవత్సరమువఱకు బ్రతిఘటించినది. కాని తుదకు కుటుబుద్దీను అను సేనానికి లొంగిపోయినది. ఈకుటుబుద్దీనే అజ్మీరు ప్రధానస్థానముగా జేయబడి యందు రాజప్రతినిధిగా నిలబెట్టబడెను. ఇంతటితో బోక యొక పట్టణము వెంబడి యొకటి యాతుఱకలకు లొంగిపోవలసివచ్చినది. సాహెబుద్దీను గజనీలో హైందవలక్ష్మితో బ్రవేశించినతోడనే యన్నను సంహరించి సింహాసన మధిష్ఠించెను. కాని



1206 సంవత్సరములో నీతడే సంహారింపబడెను. అంతటితో నిక్కడ కుటుబుద్దీను తానస్వయముగ తుఱకబానిసయయ్యు స్వతంత్రము ప్రకటించి ఢిల్లీసింహాసన మధిష్ఠించెను.

ఇంతటితో భారతస్వారాజ్యాధఃపతనము పూర్ణరూపముదాల్చినది. ఒకప్పుడు ఆసేతుహిమాచల పర్యంతము నేకచ్ఛత్రాధిపత్యముగ బాలింప రాజధానిగానున్న ఢిల్లీపట్టణము నేటికి పరదేశీయుల హస్తగతమైనది. అలెగ్జాండరువచ్చిన క్రీ. పూ 321 సంవత్సరములనుండి మహమ్మదీయ ప్రధానరాజ్య ప్రతిష్ఠాపనా కాలముగు 1206 వ సంవత్సరమువఱకు జరిగిన 1500 సంవత్సరములును భారతభూమి యెట్లు అంతర్గతమో బహిర్గతమో యగు నిరంతర యుద్ధములచే బీడింపబడినదో, యెట్లు మరల మరల సంపూర్ణవికాసము చేకూర్చుకొనగల్గుచు వచ్చినదో సూక్ష్మముగ జూచియున్నాము. ఇఁక నట్లుకాక భారతభూమిలో బ్రధానభాగము తుఱకల కైవసమొనర్పబడి మఱికొన్నివందల సంవత్సరములు మఱికొంత భాగము పోగొట్టుకొన్నదాని రాబట్టుకొనజూచుటయో జర్గించుచు పునరభ్యుదయము గూర్చిన యాశవదలక నిరంతరగాథప్రయత్నములోనున్న స్వారాజ్యయుద్ధము చూడవలసియున్నది.

1206 వ సంవత్సరము మొదలు 1526 వ సంవత్సరమువఱకుగల దేశచరిత్రయంతయు కిల్జీవంశమువారో, టోగ్లకు

వంశమువారో, మొఘలో పఠానుజాతివారు ఢిల్లీరాజ్యము పరిపాలించుచుండుటయు, దురకరాజ్యమునకు లొంగక స్వతంత్రి మనుభవించుచున్న హిందూరాజులగు రాజపుత్రులపైనో మహారాష్ట్రులమీదనో దాక్షిణాత్యులపైనో దాడివెడలి సాధ్యమైనంత భారతస్వారాజ్యలక్ష్మి కబళింప బ్రయత్నించుటయు నొకొక్కబలిష్ఠుడంతరించిన వెంటనే మరల హిందువులుతురక రాజప్రతినిధులు స్వతంత్రులై పోవుటయు మరల నెవడో బలవంతుడు బయల్దేరినమీదట వీరినెల్లర వశంవదం బొనర్చుటకు దాడివెడలుటయు నట్లు రాజ్యలక్ష్మి కడుంగడు చంచలమై యిక్కడనుండి యక్కడకు యక్కడనుండి యిక్కడకు దొర్లింపబడుచు కొట్టుమిట్లాడజొచ్చినది. కాని యీమూడువందల సంవత్సరముల మహమ్మదీయ రాజ్యకాలమంతయు సింహాసనాధిష్ఠాతలు తురకలనుమాటయేకాని మిగత రాజ్యాంగవిధానమంతయు బల్లె మొదలు పట్టణమువఱకు బూర్వహైందవవిధానమునే యనుసరించి యుండుటచే భారతదేశ మేవిషయములోను తనసౌష్ఠవము పోగొట్టుకొనలేదు. మీదుమిక్కిలి తురకలు సహితము హిందూదేశములో నివసించుటకు మొదలిడుటచే దాదాపు హైందవులై భారతభూమినే ప్రేమింపగల్గిరి. ద్రవ్య మొక్క పైసయుగూడ నిక్కడనే వెచ్చింపబడి యిక్కడి ప్రజలకే యుపయోగపడుచుండుటచే ఆర్థికవ్యవస్థ యెంతమా



త్రము చెడకపోవుటయేకాక కొన్నివిధముల నభివృద్ధికూడ నొందినది. హిందువులకంటె భోగలాలసులైన తురకలు దేశములో పారిశ్రామికులకు కళావంతులకు పండితులకు మిక్కిలి తోడునీడయై పోషించి యాయాకళల వృత్తుల శిల్పముల నభివృద్ధికి దెచ్చిరి. సామ్రాజ్య రాజ్యాంగమునందేమి గ్రామపరిపాలనమందేమి తురకలేమియు మార్పుచేయవలపెట్టక తామును పూర్వహిందూరాజుల పోల్కినేపోవుటవలన నేవో కొన్ని మతవైషమ్య ద్యోతకాపచారములున్నవన్నను బ్రజలెల్లరు దేశమంతయు బూర్వ స్వారాజ్యలక్ష్మినే యనుభవించుచున్నామను తృప్తితోనుండగల్గిరి. ఇంతకు ఈయుద్ధములు ఈరక్తపాతము, ఈస్పర్ధలు రాజవంశీకులలోను దదనుచరులలోనే యుండుటయు మిగతప్రజలెల్లరు దమసహజవృత్తులలో జెక్కుచెదరకుండుటవలననే యధఃపతన క్రమమంతదీర్ఘ కాలమువట్టినది. తుదకువచ్చిన యాంగ్లేయులశక్తియే తురకలవలంబించియున్నచో నింతబలిష్ఠమైన భారతభూమియు రెండుమూడు శతాబ్దములలోనే దుంపనాశనమైపోయి యుండును. కనుకనే కొందఱు చరిత్రకారులు మహమ్మదీయయుగమనుటకంటె నాకాలముకూడ హిందూమహాయుగములోనే పరిగణింపదగునని వ్రాసియున్నారు. రాజకీయదృష్టిలో భారతస్వారాజ్యము నందలిభూమిలో వీరిదావా యను విషయ

సందేహములో నుండుచున్నను- ఈపఠానుల రాజ్యములో సహితము సమస్తవిధముల నభివృద్ధిపందినవనుటకు కుటుబ్మీనారు మొదలగుకట్టడములును, ఎనిమిదవశతాబ్దమున బ్రాహ్మణమత పునరుద్ధారకుడని బిరుదుగాంచిన కుమారిలభట్టును తొమ్మిదవశతాబ్దమున నద్వైతమతస్థాపకుడును మహాతాత్త్వికవిశారద శిఖామణియునగు శంకరాచారి నవతరించుటయు, రాజపుత్రులు చివరవరకు దేశభక్తి పరాయణులై క్షాత్రధర్మసంరక్షణమునకై యెప్పటికప్పుడు ప్రాణముల కాశింపక యుద్ధములొనర్చుటయు భవభూతి, మాఘుండు పద్మగుప్తుడు శ్రీహర్షుడు భట్టనారాయణుడు మొదలగు కవీశ్వరులు బయల్దేరి యథేచ్ఛగా సంస్కృత వాఙ్మయాభివృద్ధి చేయగల్గుటయు, దక్షిణమున విజయనగరము మొదలగు హైందవసామ్రాజ్యము లవిచ్ఛిన్నవైభవముతో నప్పుడప్పుడువచ్చు మహమ్మదీయ దండయాత్రల నరికట్టుచు బ్రకాశించుటయు నీపఠానుయుగములో సహితము హైందవజాతీయతా ప్రకాశము చెక్కుచెదరలేదనియు ఆయానవాబులెల్లరుతమ్మువిదేశీయులుగా నెంచుకొనక హిందూదేశములో నిమిడిపోవుటకు బ్రయత్నించిరనియుజెప్పుటకు దార్కాణములుగానున్నవి-ఇంతయేల! కొందఱు మహమ్మదీయ పరిపాలకులే భారతాది పురాణములను మాతృభాషలలోనికి బరివర్తనమొనర్చుటకు బురికొల్పినట్లు నిద



ర్శనములు కనంబడుచున్నవి- ఈతరుణమందే వల్లభాచార్య శ్రీ చైతన్యుడు మొదలగు వైష్ణవభక్తులు బయల్దేరితమ యిచ్ఛవచ్చినట్లు తమతమమతముల బ్రచారమొనర్చుకొనగల్గిరి- ఇట్టి పరిస్థితులన్నియు జూడనిమహమ్మదీయ రాజ్యపాలనములో మతసహనముకూడ నంతదుర్వ్యాప్తి నొందలేదని మనమూహింపవచ్చును.

ఇబ్రహీములోడీ నోడించి బేబరు ఢిల్లీసింహాసన మధిష్ఠించినాడు. వీనితో మగలుసామ్రాజ్యము ప్రారంభమైనది. ఈమగలు ప్రథమచక్రవర్తిని బారద్రోలుటకు దేశములోగల రాజపుత్రులెల్లరు గొప్పసన్నాహమొనర్చి ఫతేపూరుసిక్రీవద్ద 1526 సంవత్సరమునందే గొప్పయుద్ధమొనర్చిరి. ఈయుద్ధమే భారతస్వరాజ్యయుద్ధముల పరంపరలో జేయదగిన పరిస్థితి గల్గినది. కాని కాలవశమున యుద్ధమున హైందవులెల్లరోడిపోయి బేబరురాజ్యము స్థిరపడుట తటస్థించినది. ఈతడు 1550 లోనే పరమపదింపగా నీతనికుమారుడు హుమాయూను రాజ్యమునకువచ్చెను. కాని యీతడమాయకుడౌటచే నొకపఠాను యోధునిచే నోడింపబడి 1543 వ సంవత్సరమున గాంధారదేశమునకు బారిపోయెను. ఈసంవత్సరమే తండ్రి యిట్లు పారిపోవుచున్నప్పుడే యక్బరుదారిలో జన్మించెను. ఈబిడ్డకు పండ్రెండు సంవత్సరముల వయస్సువచ్చునప్పటికే మంచి పరాక్ర

మశాలిర్మై 1555 వ సంవత్సరములో నాపఠానుఁడగు షర్షాపై దాడివెడలి యాతని నోడించిమగలుసామ్రాజ్యము మరల బ్రతిష్ఠింపగల్గెను. మరుసటి సంవత్సరమేయగు 1556 సంవత్సరమున నక్బరు డిల్లీసింహాసనమున బట్టాభిషిక్తుఁడయ్యెను. ఈతఁడు భారతభూమి నంతయు నేకచ్ఛత్రాధిపత్యమునకు దెచ్చి పరిపాలించిన గొప్పచక్రవర్తి. ఈతనిరాజ్య ప్రారంభమున సహితము హైందవులగు రాజపుత్రులు చిత్తూరు రానాప్రతాపుని యండఁజేరి బ్రహ్మాండప్రయత్నమొనర్చి హైందవ స్వరాజ్యలక్ష్మీపరిత్రాణ పరాయణులై యుద్ధసన్నాహము లొనర్చి అక్బరు క్రూర ఘోరదారుణ మారణకర్మమునందు జగదేకవీరులై యొక్కఁడును మిగలకుండ స్త్రీపురుషాదులెల్లరు రణరంగమున మడిసి వీరస్వర్గముచూఱగొనిరి. ఇయ్యది 1557 వ సంవత్సరమున జరిగినది. ఇంతటితో హైందవస్వరాజ్యలక్ష్మీ బాహ్యరాజ్యచిహ్నము లెక్కఁడ గానరాకుండ నాశన మొనర్పబడినవి. ఆసేతుహిమాచల పర్యంతము మగలు సామ్రాజ్యము ప్రాకి యలముకొన్నది. అయినను అక్బరుపాదుషా మిగుల వివేకియు దూరదృష్టియు గలవాఁడగుటచే హిందూముసల్మానుల సమ్మేళనముకానిదే దేశములోనిక శాంతి యుండఁజాలదని గ్రహించి తత్ప్రయత్నములు విరివిగఁజేయ మొదలుపెట్టెను. రాజపుత్రస్త్రీల వివాహమాడెను. రాజపుత్రులకన్ని ప్రధానరాజకీయో



ద్యోగములర్పించెను. మతాసహనద్యోతకములగు జిజియాపన్నులు మొదలగు వానిని తీసివైచెను. పూర్వరాజ్యాంగవిధానము మరల బ్రతిష్ఠింప రాజాతో దర్మాలుభగవాన్దాసు మానసింహులు మొదలగు హైందవ మంత్రుల సమాలోచనముతో పఠానురాజ్యములో గొంత చెడిపోయిన పంచాయితీవిధానము పన్నుల సమీకరణము వ్యవసాయాభివృద్ధి కళాప్రవృద్ధి పరిశ్రమా ప్రోత్సాహము నొనర్చి తానే హైందవతత్వములోవిలీనమైపోయినాఁడు. కనుకనేమగలుసామ్రాజ్యమీతనికాలములో నంతవైశాల్యము యశస్సు సంపాదింపగల్గినది. అనగా రాజకీయరంగమున హైందవస్వరాజ్యలక్ష్మీ బాహ్యాచిహ్నల పోఁగొట్టుకొన్నను మిగతమత, సాంఘిక, నైతికార్థిక సందర్భములందు తన సంపూర్ణ వైభవముతో బెంపొందుటచేగాక మగలు చక్రవర్తులనే తన బిడ్డలుగా బరిగణించి ముసల్మానులగూడ భారతీయులుగ నొనర్చి హిందూముసల్మానుల సఖ్యము సమకూర్చి పూర్ణవికాసముతో సంపూర్ణజీవనముతో సమగ్రసౌఖ్యముతో విరాజిల్లగల్గినది.

ఈతనివెంట రాజ్యమునకువచ్చిన జహాంగీరుపాదుషా, రాజపుత్రస్త్రీకి జన్మించినవాఁడే; ఈతనికుమారుఁడై తరువాత రాజ్యమునకువచ్చినషాజహాను సహితమురాజపుత్రస్త్రీకి జన్మించినవాఁడే! ఇట్టిపరిస్థితులలో మగలుసామ్రాజ్యము సహితము

హైందవమేయనుటలో నాశ్చర్యమేమున్నది? జహాంగీరు షాజహానుల తరువాత లోకకంటకుడు నిరంతరయుద్ధాభిలాషి మొగలుసామ్రాజ్య పరిభ్రష్టకారకుడు మతాభినివేశి మహాహంతకుడునగు ఔరంగజేబు 1658 సంవత్సరములో రాజ్యమధిష్టించెను- తాతముత్తాతలుచేసిన హిందూముసల్మాను సమ్మేళనము భగ్నమొనర్చుటయేకాక యనేకవిధముల హిందువుల బాధింపమొదలుపెట్టెను- తమ్ములనన్నల ఘోరముగ సంహరించి రాజ్యమపహరించిన యీతడు తనరాజ్యము నిలబెట్టగల్గునా? ఈతనియంతములోనే మొగలుసామ్రాజ్యము విచ్ఛిన్నమైపోయినది- ఈమొగలు సామ్రాజ్యమిట్లు విచ్ఛిన్నమగుటకీతడేకాక మఱొక కారణముకూడ నున్నది-

రాజ్యచిహ్నాలుపోయి క్రుంగుడువడిన హైందవస్వరాజ్యలక్ష్మినిచూచి కన్నీరుపొటపొటగార్చి హైందవసామ్రాజ్యపునఃప్రతిష్ఠాపనాదీక్షవహించిన యొకమహావీరుడు చరిత్రరంగమునందవతరించెను- ఆమహనీయుడే శివాజీఛత్రపతి; ఈతడొక మహారాష్ట్రుడు ఆజన్మయుద్ధరంగ జీవులగు మహారాష్ట్రయోధుల బురికొల్పుకొని మహమ్మదీయుల నీదేశమునుండి సాధ్యమైనచో దరిమివేయ గంకణముకట్టుకొని స్వశక్తివలన గొప్పరాజ్యము సంపాదించి చతురోపాయముల శత్రువులజించిచెండాడిన శివాజీమహారాజు హైందవస్వరాజ్యలక్ష్మిని



మరల పూర్వవైభవమునందుకొనజేయుటకు బ్రయత్నించి చాలవఱకు కృతకృత్యుడయ్యెను- మంచిచేతనో చెడ్డచేతనో నయముననో భయముననో, తనచుట్టుపట్టులంగల మహారాష్ట్రరాజుల వశంవద మొనర్చుకొని మహమ్మదీయ రాజ్యపరిపాలకులగు ప్రతినిధులను నవాబులను పాదుషాను నిలువనీయక యెప్పటికప్పుడు ప్రక్కలోని బల్లెమువలె మెలగి యొకకొండంతటి పేచమడంచి యొకపెద్దహిందురాజ్యము ప్రతిష్ఠింపగల్గిన యీతడు 1674 సంవత్సరములో రాయపురమందు రాజ్యాభిషేకమంది పాదుషా బిరుదమందెను- రాజ్యాంగవిధానమునందు సహితము చంద్రగుప్త మౌర్యునివలె పురాతనరాజ్యాంగ విధానమంతయు పునరుద్ధరించి నిజమైన భారతస్వరాజ్యలక్ష్మి నొకసారి ప్రత్యక్షమొనర్చుకొనెను.

1680 వ సంవత్సరమున శివాజీ పరమపదించినతోడనే యౌరంగజేబు మహారాష్ట్రుల నడగద్రొక్కుదుమనుకొని 1682 లో దండెత్తివచ్చినప్పుడు శివాజీపుత్రుడు రాజారామ్అనునాతడు మహారాష్ట్రనాయకుల ప్రోగుచేసికొని మహాస్వాతంత్ర్యయుద్ధము నిరువదిసంవత్సరములు నెడతెగని సంరంభమున సాగించుటకై ప్రారంభించెను- తుదకౌరంగజేబు వీరితోపోరలేక 1705 లో సంధియొనర్చుకొని నిరుత్సాహముతో మరి రెండు సంవత్సరములకే చచ్చిపోయెను- శివాజీ మనుమడు

సాహూ అనువాడు రాజ్యాభిషిక్తుడై తాత పేరు చాలవఱకు నిలబె
ట్టగల్గెను- బాలాజీవిశ్వనాథు ప్రధానపేష్వాయై మహారాష్ట్రరాజు
లనెల్లరనొక హిందూసామ్రాజ్యమునకులోబడునట్లు చేసి 1718
వ సంవత్సరములో ఢిల్లీముట్టడివైచి సాహూచక్రవర్తిత్వము
నకు వప్పుకొని కప్పము చెల్లించునట్లు అప్పటి మగలాయిచక్ర
వర్తిని లొంగదీయగల్గెను.

మహారాష్ట్రులిట్లు హిందూదేశములోజాలభాగమాక్ర
మించి నూరుసంవత్సరములు హైందవ స్వరాజ్యలక్ష్మి నిలువ
బెట్టగల్గిరి. కాని దేశములోగల యితరప్రదేశములన్నియు జిన్న
చిన్న శకలములక్రిందనై యనేకమహమ్మదీయులచేతను హిందు
వులచేతను బరిపాలింపబడుచు అనైకమత్యముతో నిరంతర
సంగ్రామ సంరంభముతో నల్లాడుచుండుట తటస్థించినది. ఇట్టి
సంకుల సమయమగు దుష్కాలముయొక్క నైశిత్యము పరిపూ
ర్తియగుటకు చరిత్రరంగములోనికి పాశ్చాత్యులుకూడ దయ
చేసిరి. వీరివలననే తరువాయిపని పూర్తికాబడసియున్నది. ఐరో
పాదేశములో సేవ్యభూములు తక్కువగనుండుటయు బ్రజలె
ల్లరు పరిశ్రమలచే బ్రదుకవలసియుండుటయు నప్పటివఱకు
హిందూదేశము ప్రపంచకమునకంతకు సమస్తవస్తువుల సమ
కూర్చుచుండుటయు నాప్రాంతములలో హైందవభోగభాగ్య
ములు బ్రహ్మాండముగ నభివర్ణింపబడుచుండుటయు జరుగు



చుండుటచే నైరోపీయులలో జాలమంది యీప్రాంతము
లకువచ్చి వర్తకము జరిగింతుమని యనేకవిధముల బ్రయ
త్నించిరి. తుదకు పోర్చుగీసువారు ఆఫ్రికాఖండము చుట్టుతి
రిగి నాటుదారిలో దగులు తుఱకరాపిడి దగులకుండ సముద్ర
మార్గమున హిందూదేశము చేరి పశ్చిమతీరమున జేరి యిసు
క తిప్పలలో బసచేసి యిప్పటి గుంపులవాండ్రవలె మూటల
బుజానవైచికొని తమవస్తువులనేమో యమ్ముకొనుచు నిచ్చటి
వస్తువులనుగొని తమదేశమునకు రవానాచేసికొను వ్యాపార
మొనర్ప మొదలిడిరి. అప్పటి మనరాజులేమి నవాబులేమి
"వీరేమి హాని చేయగలరు, పాపము దూరమునుండి వచ్చిన
వారలు వర్తకము చేసుకొననిండని యనుమతించినారు. ఇంక
వీరిని జూచి డచ్చివారు, ఫ్రెంచివారు ఆఖరున ఇంగ్లీషువారు
క్రమక్రమముగా వచ్చి సముద్రప్రాంతములందే చిన్నచిన్న
ఫ్యాక్టరీలను గట్టుకొని యప్పటి హైందవరాజుల యనుగ్రహా
వశమున విఱివిగా వర్తకములు సాగించిరి. కరాచీ మొదలు
కలకత్తావరకుగల ప్రాక్పశ్చిమ సముద్రమంతలోను కలకత్తా
చంద్రనగర్, బందర్, చెన్నపట్టణం, పాండుచ్చేరి, గోవా,
బొంబాయి మొదలగుచోట్ల నీతెల్లజాతులవాండ్రు స్థిరవాస
ము లేర్పరచుకొన్నతరువాత దేశదౌర్భాగ్యస్థితి వీరునుగని ఇ
ట్టి క్రుత్రిమమార్గములవలంబించి పిల్లిమీద నెలుకను నెలుక

మీఁదపిల్లిని నెక్కించి పోరాడించి కొందరొకపక్షము మఱి కొందరొకపక్షముల నాశ్రయించి గెలిపించితిమని కొంచెము కొంచెము భూవసతులు వర్తకసౌకర్యములు ద్రవ్యబహుమానములు సంగ్రహించుచు బలిసికొన ప్రారంభించిరి. 1600 వ సంవత్సరమున ప్రారంభించిన యింగ్లీషువారు ఒకశతాబ్దమువరకు చిన్న చిన్న కంపెనీలుగా నేర్పడి కలకత్తా, మెడ్రాసు, బొంబాయి మొదలగు కొన్ని చోట్లలోనే కోటలనిర్మించుకొని వర్తకమే సాగించుకొనుచు లాభముకొరకే బహుకష్టములబడుచు భాగ్యముకొరకే యెన్ని యవగతులైన జేయుచు నొండొంట పోరాడుకొనుచున్నారు. ఆఖరుకు 1702 సంవత్సరమున బ్రిటిషుగవర్నమెంటుచే నీకంపెనీలన్నియు సమ్మేళనముకావింపబడి యునైటెడు యీస్టుయిండియాకంపెనీక్రింద వర్తకమొనర్చుటకు ననుజ్ఞ యీయబడినవి. ఇంక హిందూదేశమున ఫ్రెంచివారా యింగ్లీషువారా మిగులవలసినవారను విషయసమస్యకులోనై ఫ్రెంచివారితరఫున డుప్లేయు ఇంగ్లీవారికి క్లైవుదొరయును దొరకి దేశములోగల రాజులనెల్లర బోరాడించుటలోను నిరుపక్షములనుండి యిర్వురు కొంతకొంత ద్రవ్యమో భూమియో వర్తకసౌకర్యమో గ్రహించుటకు పోటాపోటీపడుచు నిరంతరయుద్ధము లొనర్చుకొనిరి. వీరికిగాని వారికిగాని సంగ్రహింపబడిన ప్రదేశములందు రాజ్యపాలనమను నది వారివారి



వర్తకలాభములకే వినియోగించుట తప్ప ప్రజాసౌఖ్యము చూచుట యొంతయులేక మహానరకముక్రింద బరిణమించినది. డూప్లేదుండగములు క్లైవు ఆగడములు వారన్ హేస్టింగ్సు పోర్జరీలు మొదలగు ఘోరములు పాశ్చాత్యులేయభివర్ణింపలేక యేవగించుకొని ఘోరముఘోరము ఘోరమని ఘోషిల్లిరి. హైందవస్వరాజ్యలక్ష్మిభిన్న భిన్న శకలములై విగతమాంగళ్యయై యంతిమావస్థలో ఘూర్ణిల్లుచున్నది. ఇంతటితోఁ బోక లాభమే ద్రవ్యమే భాగ్యమే యైశ్వర్యమే తమదేశములకు ఎట్లైనను ఏవిధముచేతనైనను గొంపోవుట కుద్యుక్తులైనయీ వర్తకసంఘము విచ్చలవిడిగ దేశము కొల్లగొట్టుకొనుటయేగాక తమ స్వదేశీయవృత్తులకు అడ్డుదగులుచున్న వృత్తులన్నిటిని బలవంతముగ నాశనమొనర్చివేయ మొదలిడినది. ఢక్కామజిలీనునేత యితరవృత్తులు వారిమూలమున నుగ్గునూచమైపోయినవి. విదేశీయులతో జరుగుచువచ్చిన హైందవవర్తకమంతయు నీవర్తకసంఘములచే సంహరింపబడినది. అనేకవిధములుగ నీదేశమునుండి యనేకకోట్ల రూప్యముల ద్రవ్యప్రవాహమైరోపాకు నిరంతరము పాఱఁజొచ్చినది. న్యాయములేదు శాంతిలేదు దయలేదు దాక్షిణ్యములేదు గౌరవములేదు భయములేదు భక్తిలేదు. వర్తకసంఘములు సంపాదించిన రాజ్యభాగములిట్లు నలుగుడు వడుచుండుటయు దేశములో బలమైనహైం

డన రాజ్యము నశించిపోవుటయు బ్రజలలో మొదట జెప్పబడిన యుపేక్షాది దుర్గుణములావహించి యుండుటయు దోడై భారతస్వారాజ్యలక్ష్మియధఃపతన పరిసమాప్తికి రప్పింపగల్గినవి. ఆంగ్లేయులు బ్రతిఘటించుచు వచ్చిన ప్రెంచివారు నంతరించిరి. వీరే ప్రముఖులైరి. వర్తకము ముందు, రాజ్యపతాకము తరువాతను నడిపించి భారతభూమి యంతయు వీరునాక్రమించుచుండిరి.

ఇట్లనుటచే వీరు తమసహజ పరాక్రమముచేత సంపాదించిరేమోయని భ్రమపడగూడదు. అప్పుడు మనదేశములోగల చిన్నరాజులెల్లరు ఒండొరుల వీరిసహాయమున సంహరించుకొని దేశమునాథ మొనర్చి వీరికొప్పజెప్పిరికాని వీరికి మొదట సామ్రాజ్యకాంక్షయే లేదు, కంపెనీ డైరక్టరులప్పుడప్పుడిక్కడ గవర్నరుల నిట్టియుద్ధములలో జోక్యము కలుగజేసికొనవద్దని దూషించుచు వ్రాయుచుండెడివారు. హిందూదేశములో బ్రిటిషుసామ్రాజ్యప్రతిష్ఠాపనాచార్యుడైన క్లైవుదొరచేసిన దుండగములు తెలియవచ్చి యిప్పటిపార్లమెంటు వానినిమిక్కిలి తర్జనభర్జన మొనర్చి యాతని నెంతయు గర్హించినది. ఆతడుతుదకు ఆత్మహత్యగావించుకొని మడిసినాడు. వారన్ హేస్టింగ్సు గవర్నరుగావచ్చి హిందూదేశమున బ్రజలకొనర్చిన ఘోరదురంతములు మోసములు, దుర్ణయములు పార్లమెంటుల సభ



లోనే చర్చింపబడి తీవ్రముగా ఖండింపబడినవి. కానివీర లుభయులును దమదేశమునకుదెచ్చిన గౌరవహైన్యముకంటె సామ్రాజ్యలాభ మెక్కుడుగా బరిగణింపబడి, వారు క్షమింపబడినారు.

ఉమాచందు విషయమై క్లైవుదొరచేసిన ఫోర్జరీమోసములును హేస్టింగ్సు నందకుమారు నురితీయించుటలో జేసిన దురంతమును అయోధ్యబీగాముల ద్రవ్యాపహరణ మహాఘోరమును చరిత్రలు చదివినవారలకెల్లరకు జగద్విదితమైన విషయములే! ఈహంతకుని విషయములో పార్లమెంటులో గొప్ప చర్చజరిగి యాతడుతుదకు క్షమింపబడుటకంటె నాసమయమున బర్కుదొర తనయుపన్యాసాంతమున నొసంగినవాక్యము లిప్పటికిలోకములోజరిత్రకారులచెవులు గింగురుగొల్పుచున్నవి.

"I impeach him in the name of the commons' house of parliaments whose trust he has betrayed, I impeach him in the name of the English nation, whose ancient honour he has sullied, I impeach him in the name of the people of India, whose rights he has trodden underfoot, and whose country he has turned into a desert hastliy, in the name of human nature itself, in the name of both sexes in the name of every age, in the name of evrery rank, I impeach the common enemy and oppression of all.

తనయందుంచిన విశ్వాసమునకు ఘాతుకుడై మోస మొనర్చినందులకు యీపార్లమెంటుతరుపున ఆతనినేను ఖండించుచున్నాను. ఆంగ్లజాతితరపున ప్రాచీనగౌరవమంతయు బూడిదపాలొనర్చినందుల కతని నేను గర్హించుచున్నాను. హైందవప్రజలహక్కుల నడగద్రొక్కినందులకును హైందవదేశమునంతయు నొక్కయెడారిక్రింద బాడుచేసినందులకా హైందవప్రజలతరపున నేనీతనిదూషించుచున్నాను. మానవస్వభావము స్త్రీపురుష జారత్వపక్షమున చరిత్రలోనడిచిన ప్రతియుగముపక్షమున జగత్తులోగల యత్యుత్తమాధమ పరిస్థితి ప్రజాపక్షమున ఈసర్వహాంతకుని ఈసకలశత్రువుని నేనెంతయు గర్హించుచున్నాను,, - అని చెప్పియున్నాడు. వీనితరువాతవచ్చిన కార్నవాలీసు దొరయు వెల్లెస్లీదొరయు బూర్వమార్గమునే త్రొక్కి దేశములో నాలుగు మైసూరుయుద్ధములు మూడుమహారాష్ట్రములు రెండుశిక్కుయుద్ధములు బ్రహ్మాండరక్తపాతముతో జర్గించి టిప్పూసుల్తానును, నైజాము మహారాష్ట్రులను, శిక్కులరాజ్యములను నన్నిటిని గ్రమక్రమముగా బ్రిటిషురాజ్యములో గలిపివేసికొనగల్గిరి- డల్హౌసీదొర దయచేసి యింక దేశములో స్వతంత్రరాజ్యము లుండగూడదనియు నొక్కసారిగా సువ్వెత్తుగా నాసేతు హిమాచలపర్యంతము బ్రిటిషుపతాక మెగురవలెనని దత్తతాధికారములేదని కొన్నిసంస్థానములను, బాగుగా బరిపాలింపలేక పోవుచున్నవని మఱికొన్నిరాజ్యములను దమలోదాము తగువులాడుకొనుచున్నవని యింకగొన్ని సంస్థానములను బ్రిటిషురాజ్యములోనికి స్వాయముగా బలవంతముగా గలుపుకొనగల్గెను- ఇంతవఱకువచ్చిన యీకంపెనీరాజ్యము గూర్చి ఏనిబిసెంటుదొరసాని యిట్లువ్రాసియున్నది:—



"The company made treaties and broke them or forged them, if more convenient; it cheated, robbed murdered oppressed and built an Empire in about a century.

కంపెనీరాజ్యము సంధులొనర్చినది వాగ్దానభంగములొనర్చినది. వీలైనయెడల ఫోర్జరీలకుదిగినది. మోసముచేసి, దొంగతనమొనర్చి, ఖూనీలుజర్గించి మహాఘోరములకు పాల్గొని తుదకు సామ్రాజ్యము నుశతాబ్దకాలములో నిర్మింపగల్గినది,, - అని వ్రాసియున్నది. హిందూదేశములోని సమస్తభాగ్యములు, సంపదలు సౌకర్యములు నశించిపోవుట యీశతాబ్దముననే జరిగినది. హైందవస్వరాజ్యలక్ష్మి (150) సంవత్సరములు యధఃపతన మహాసంరంభములో దగుల్కొనియు బ్రదుకగల్గినదికాని యీకంపెనీరాజ్యమొనర్చిన మహాఘోరములకు మోసములకు ఆరోగ్యముచెడి, ఐశ్వర్యమపహరింపబడి యాయుర్దాయము సన్నగిల్లి,

యజ్ఞానము ప్రబలి యనాథత్వము పెచ్చుపెరిగి యమాంగళ్యమైయనవరతదుఃఖ క్షామరోగబాధా పరంపరల నడంగి ఢల్హౌసీ యొనర్చిన యమానుషమారణకర్మమునకు లొంగి ప్రాణము విడిచినది. వర్తకము లేదు. వృత్తులు లేవు. వ్యవసాయము లేదు. వ్యవహారజ్ఞానము లేదు సమస్తము శూన్యమై దేశము స్మశానమై యాపదివేల సంవత్సరముల స్వరాజ్యలక్ష్మియు విగతజీవియై దహనసంస్కార మొనర్పబడినట్లు నిస్తేజమై కనంబడుచున్నది. ఇంతటితో నధఃపతనక్రమ పరిసమాప్తి సంఘటిల్లినది.



# పునరుద్ధరణ ప్రయత్నములు

జలప్రళయమునుండి సుమారు పదివేల సంవత్సరములు శుద్ధస్వతంత్రి ననుభవించిన భారతస్వరాజ్యలక్ష్మి యలెగ్జాండరు దండయాత్ర మొదలు 1856వ సంవత్సరమువరకు గలయధఃపతనక్రమములోని యలజడి రక్తపాతము నైశ్వర్యవినాశము పొందుచు నావిధముగ నాంగ్లేయుల కుంపిణీరాజ్యకాలమున మదముట్టింపబడినది కాని దేశములో నింకను మానుషము చావలేదు. ఇట్టి మహాధోగమనమునుండి మరల భారతమాతనుద్ధరింపవలెనని పేరాసగల్గిన మానవులింకను బ్రతికియున్నారు. ఇవియుగాక రాజ్యము లపహరింపబడిన రాజులు యుద్ధరంగములో నన్యాయముగా నోడింపబడిన యోధులు వృత్తులుపోయి కష్టములపాలైన ప్రజలు మతాభినివేశముకల యువకులు, హిందువులు మహమ్మదీయులు సమస్తమతములవారు సమస్తపరిస్థితులలో నున్నవారును నట్టి యాంగ్లేయప్రభుత్వ మువ్వెత్తుగ రూపుమాపుదుమనియు హైందవస్వాతంత్ర్యము పునఃప్రతిష్ఠాపన మొనర్తుమనియు గట్టిగ బ్రయత్నింపసాగిరి. ఇందు నానాసాహేబు తాంతియాతోపీ ఝాన్సీరాణి మొదలగువారు ముఖ్యులు. వీరెల్లరు సుమారు హిందూదేశమంతయు బ్రచారము గూఢముగ సాగించి విదేశీయులపై గల ద్వేషముప్రజ్వ

లింప బద్ధకంకణులైరి. ఈకోపాగ్ని ప్రజ్వలనకార్యమునందు సాధువులు సన్యాసులు, పండితులు, పౌరాణికులు భాగవతులు తోలుబొమ్మలాటగాండ్రు, దొమ్మరులు కూడ బాల్గొనిరని తెలిసినప్పుడు నిజముగా సామాన్యప్రజలుకూడ నెంతప్రయత్నము లొనర్పసాగిరో యిప్పటికిని ప్రజాబాహుళ్యమునందు దేశభక్తి యెంత నిశితముగానున్నదో మనము సూక్ష్మముగ గ్రహింపవచ్చును.

అప్పుడు నిప్పుడుగూడ బ్రిటిషు ప్రభుత్వమునకు గల సైన్యసంపత్తియంతయు హైందవజాతియే పొందుచున్నది. కొద్దిగ మాత్రము బ్రిటిషుజాతీయమై సోల్జర్లనుపేరుతో వ్యవహరింపబడు సైన్యముండుచున్నది. ఈపరిస్థితులలో మననానా సాహేబుప్రభృతులు తమ గూఢ ప్రచారమంతయు ముఖ్యముగా సిపాయనబడు దేశీయసైన్యమునందే సాగించుచుండుటచేతను సిపాయిలు సహితమనేక మతవిషయక పరాభవక్లేశములు బ్రిటిషుసేనాధిపతుల మూలమున పొందుచుండుటవలనను బ్రిటిషుద్వేషదవానలము నందసహ్యమానమై యాసేతుహిమాచలపర్యంతము నిమేషమాత్రమున నలముకొని ప్రజ్వలించుచున్నది- బ్రిటిషుప్రభుత్వములో గల గుమాస్తామొదలు పెద్దయుద్యోగస్తుని వరకుగల యందరును దేశీయులేయౌట చేతను వారిలోజాలమంది యాయాదేశములోబడి గూఢప్రచా



రమున కూతయిచ్చియుండుటచే గొట్టకొనలగల బ్రిటిషుద్యోగులీ ప్రచండాగ్నిని గనిపెట్టలేకపోయిరి. దేశములోగల ప్రజలెల్లరీసంరంభముతో మరల హైందవస్వరాజ్యము ప్రతిష్ఠింపబడునని యుఊరిట లూగుచున్నారు. సైనికాంగణములన్నియు నొక్కసారిగ నొక్కదినమున నొక్కవిధముగ దిరుగబడి యెక్కడెక్కడ గల ఫిరంగీల నెల్లర నుగ్గునూచముగ సంహరించి బ్రిటిషుప్రభుత్వము రూపుమాపుదమని యొక సుముహూర్తము సహితము నిశ్చయించుకొనిరి. స్వదేశసంస్థానములను పేరుతో బ్రిటిషుప్రభుత్వమునకు లోబడియవమాన దుఃఖమనుభవించుచున్న నన్ని యీమహోద్యమమునకు ద్రవ్యసహాయమొనర్చుటయేకాక యాసుముహూర్తమునకు దామును దిరుగబడి మహాసంగ్రామమునకు డీకొందుమని వాగ్దానమొనర్చియున్నారు.

ఈవిధముగ లక్నోలో కాన్పూరులో మీరట్టులో ఢిల్లీలో, లాహూరులో దక్షిణమున మెడ్రాసులో దక్కంగల సైనికస్థానము లన్నిటిలో బ్రబలమైన రహస్యప్రమాణములలో దేశీయసైన్యములన్నియు నొండొరుల బురికొల్పికొని సిద్ధపడియున్నవి. కాని మంగళపండాయను సైనికుని యుద్రేకదోషమువలన మీరట్టులో నాసైన్యమంతయు సుముహూర్తమువఱకు వేచియుండజాలక కొన్ని రోజులుముందై తిరుగు

బాటు సాగింప ది 10 మేయి 1857 సంవత్సరమున ప్రస్థానభే రి మోగించి యర్ధరాత్రిమున బ్రిటిషుసైన్యశిబిరములపైబడి మారణక్రియకు దొరకొనిరి. మిగత ప్రదేశములందుగల నాయకులెల్లరు సుముహూర్తమువఱకు వేచియుండవలసినదా వీరితోబాటిప్పుడే యుద్ధము ప్రారంభింపవలసినదా యను సంశయమునకు లోబడుటచే నదివరకున్న గమికచెడి ప్రారంభమునందే గొప్పలోపము సంక్రమించి యీమహోద్యమవిఘ్నముగ బరిణమించినది. ఇట్లుతటపటాయించి కొంత కాలరహణమైన తరువాత నెల్లయెడల నిట్లు సైనికులు ప్రజలు బ్రిటిషుప్రభుత్వముపై దిరుగబడి గొప్పయుద్ధము కొనసాగించిరి- ఇదియే విజయమందినచో భారతస్వరాజ్యయుద్ధమని పిలువబడియుండును- అట్లుకాక కాలవశమున దేశీయులు తుదకోడిపోయి యడంగుటచే, సిపాయిపితూరియని మాత్రము చరిత్రలలో నామకరణ మొనర్పబడినది. దాక్షిణాత్యులు దేశీయులకు వాగ్దానమురీతిసహాయము చేయుటకు బదులు బ్రిటిషుప్రభుత్వమునకే సహాయపడుటచేతను పెక్కుసైన్యములు ఘూర్ఖాలుహైందవ మహమ్మదీయులతోబాటు సమీకరింపకపోవుటచేతను నామహాయుద్ధములో, దేశీయులకోటమి సంఘటించినది- అయినను జనవరి 1859 సంవత్సరమువఱకు సంగ్రామముసాగి యనేకవిధపరిణామములంది యొకప్పుడు ప్రజలపక్షమునను మరొకప్పుడు ప్రభువులవై పునను జయలక్ష్మి యొఱగిదొఱగి తుదకు బ్రిటిషుప్రభువులనే వరించియున్నది- కనుకనే పితూరియని పిలువబడినది.



అంతిమసాధనమగు దండోపాయముతో స్వరాజ్యపునః ప్రతిష్ఠాపనగూర్చిన ప్రయత్నములలోనిది యాఖరుదైనను 1800 మైళ్ళ వెడల్పు 1800 మైళ్ళ పొడవుగల దేశమంతయు నన్నిమతములవారితో నన్నిజాతులతో నన్నియవస్థాగతులను జనులతో నొక్కబనిమీాద నైకమత్యము బురస్కరించుకొని జర్గింపబడిన ప్రయత్నములలో నిది మొదటిది యగుటచేతనే యద్దానిని మనము పునరుద్ధరణప్రయత్న ప్రకరణమందు మొదటిదిగా వ్రాయుచున్నాము- విదేశీయప్రభుత్వములోని బానిసత్వము పాఱద్రోలుటకు బ్రయత్నించుటలో నిప్పుడుజరిగినంతయైకమత్యప్రవృత్తి యదివఱకెప్పుడును జరుగలేదు- కాని యదివఱకే ప్రభుత్వనౌఖరులఁ దయారుచేయుట కేర్పడిన యింగ్లీషువిద్యాలయములో జదివిన విద్యార్థులలోనేమి యితరప్రజలలో గొందఱిలోనైననేమి యుపేక్షాభావము ఆంగ్లేయులు దేవదూతలను వ్యామోహము, వెనుకనెన్నో సంవత్సరముల నుండి జర్గుచువచ్చిన నిరంతరరక్తపాత పూరితసంగర సంకులత్వమునలన జనించినవిసుగు శాంతదినములు ప్రీతిరేకెత్తియుండుటచే బ్రథమప్రయత్న మావిధముగ భగ్నమైపోయినది.

కానియిది యెంతభగ్నమైనదో యంతఫలితముకూడ నిచ్చియున్నది- ఈసంగరఫలితమే కంపెనీ రాజ్యమంతరించి బ్రిటిషుప్రభుత్వము సాంగోపాంగముగ విక్టోరియా రాజ్ఞితో గూడ హిందూదేశము పాలించుటకు మొదలుపెట్టుటయని చెప్పకతప్పదు.

ఈ ,,పితూరీ,, దెబ్బయే బ్రిటిషుప్రభుత్వము విక్టోరియాను హిందూదేశమునకు చక్రవర్తినిగ బ్రకటింపించి అల్హాబాదులో 1 నవంబరు1858 సంవత్సరమున గొప్పదర్బారుజరిపించి దేశప్రజల కాచక్రవర్తినియొసంగిన ఫర్మానాగా నొక గొప్పవాగ్దానము జదివించుటకూడ జరిగినది. ఆఫర్మానాలో గొన్నిముఖ్యములగు వాక్యములీక్రిందివి!

"It is our further will that, so far as may be, our subjects of whatever race and creed, be freely and impartially admitted to office in our service, the duties of which they may be qualified by their education, ability and credit duly to descharge. In their prosperity will be our strength; in their contentment our security; and in their gratitude our best reward."

జాతిమత వివక్షతలతో నిమిత్తంలేకుండ నాప్రజలెల్లరు నాయావిధముల నిర్వర్తించుటకు వలసిన విద్యాసమర్థతలు గల్గుటయే తడవుగా సమస్తోద్యోగములందును బ్రవేశింప నిచ్చుటయే మాకోరిక. ప్రజలయభ్యుదయమునందే మాబల



మున్నది. వారితృప్తివలననే మాకుస్థిరత్వ మేర్పడగలదు. వారికృతజ్ఞతయే మాకు గొప్ప బహుమానము అనియాఫర్మానాలో వ్రాయించి ప్రకటించిరి. ఈఫర్మానాతో దేశములో గొప్ప పరిణామము తటస్థించినది ఏకచ్ఛత్రాధిపత్యముగల ప్రభుత్వమొకటి దేశమునకు సిద్ధించి దేశములో నింకశాంతి నిలవగలదనుయభిలాషమొదటిది. ఈఫర్మానాలోగల యాంఖరుమాటలలోని యర్థముత్వరలో సార్థకపడగలదను పేరాస రెండవది. అదివరకు తిన్నారెన ప్రజలకు చదువువలన నొకవృత్తియేర్పడుచున్నదను తృప్తిమూడవది. కంపెనీరాజ్యముగుటచే నట్లు ఘోరములొనర్చినదికాని ప్రజాస్వామిక పరిష్కృతరాజ్యముగల్గిన బ్రిటిషుప్రజలచేతిలో బడుచున్న భారతమాత సుఖింపగల్గి యధికాభివృద్ధి నొందగలదను భ్రమనాల్గవది. ఈనాల్గుభావములునాల్గు సమ్మోహనాస్త్రములయి దేశప్రజల నొక్కుమ్మడి పూర్వదేశభక్తి స్వరాజ్యాభిలాష విదేశీప్రభుత్వాసహ్యముఙ్గొట్టు రాజభక్తులుగను సుఖప్రియులుగను స్వార్థపరులుగను పిరికిపందలుగను మానవనైజశూన్యులుగను జేసివైచి స్వాతంత్ర్యముకంటె బానిసత్వమే మంచిదను ప్రలాపములొనర్చు సంధిలోనికిదింపి విగతప్రాణులుగ జేయమొదలిడినవి. ఈపరిస్థితికి దోడుగ పుండుపై నుప్పుపెట్టినట్లు ప్రతిష్ఠింపబడిన యాంగ్లపాఠశాలలలో జెప్పువిద్యలలో నెల్ల భారత

పూర్వస్థితి అంధకారమయముగను బ్రిటిషుప్రస్తుతస్థితి ప్రజల తేజోవంతముగ జూపింపబడుచుండుటచే బ్రజలకు పాశ్చాత్య నాగరికతా వ్యామోహములు కన్నులగప్పివైచినవి. ఈసమయముననే తరుణమునకనిపెట్టి ప్రభుత్వముహిందూదేశములో ఆయుధచట్టము ప్రవేశపెట్టి ప్రజలనెల్లర నాబాలగోపాలము నిరాయుధులుగజేసివైచినది. వీరాగ్రేసరులెల్లరు పరాక్రమసంపన్నులందరు ఆయుధములూడ్వబడి కోరలుబెరికిన త్రాచుపాములెట్లు పాములవానిబుట్టలో దాసత్వమనుభవించునో యట్లే బ్రిటిషు ప్రభుత్వమునకులొంగి సలాములొనర్చి పిఱికిపందలు పరప్రత్యయనీయులునై మాటుమణిగిరి.

మఱియు ప్రభుత్వములో నిజపరిస్థితుల బరిశీలించిచూచినను విక్టోరియా ఫర్మానాకర్థము తేలదనియే తెలియుచున్నది- బ్రిటిషుదీవులలోగల ద్రవ్యవంతులు పంపినప్రతినిధులగు ద్రవ్యవంతులతోగూడిన పార్లమెంటు సర్వాధికారము చెలాయించుచున్నది. రాణికిగాని రాజునకుగాని యావంతయధికారములేదు. అట్టిపార్లమెంటుచే నియమింపబడిన మంత్రివర్గములోని రాజకీయాధికారమునకు లోబడిన హైందవరాజ్యాంగవిధానమంతయు హైందవప్రజలకొఱకుగాదని పిల్లవానికినహితము తెలియదగినదైయున్నది. బ్రిటిషుప్రజలెల్లరు వర్తకులు ద్రవ్యకాములు, స్వలాభమెట్లభివృద్ధి నొందించుకొనవలెనో



తెలిసినవారలు ఒక్కపైసనష్టమునకును బీకమీదికివచ్చిన గాని యొప్పుకొనజాలరు. హిందూదేశములోని ముప్పదిమూడుకోట్లుప్రజలు తమవస్తువులనేకొనుచు తమరినేమెచ్చుకొనుచు తమకర్మాగారములకు ముడివస్తువులతికారుచౌకధరలో బంపించుకొనుచు గలకాలము బ్రదుకవలెననియే వారికోరిక! మనయింటగలయావు మనదొడ్డిలోమేసి తనపిల్లకును మానుకొని మనకే యామెపాలన్నియు నీవలెనని మనముకోరుటలేదా! అట్లే బ్రిటిషువారును మనము శాశ్వతముగ వ్యవసాయదారులమై వారివిశ్వజనీనవర్తకమునకు గట్టుకొన్న మహాకర్మాగారములకు మనమిక్కడ దూదివగైరాలు పండించుచు వారు తయారుచేసిన గుడ్డలవగైరాల వారు చెప్పినధరతో స్వీకరించి బ్రదుకుటకు వారి యాక్షేపణమెన్నటికి నుండదు. అట్లుమనము వశంవదులమైయున్నన్నినాళ్ళు మనడబ్బుతో వారి సైనికులరప్పించి మనపై నితరులు దండెత్తకుండను మనలో మనము పోరాడుకొనకుండను గాపాడుటకు సంసిద్ధులైయున్నారు. ఇట్టి శాశ్వతత్వము నపూర్వశాంతి ప్రతిష్ఠాపన కొఱకే న్యాయాన్యాయ విచారణముకూడ లేకుండ నట్లు కంపెనీ రాజ్యకాలములో సమస్త సంస్థానముల నొక్కుమ్మడి యెత్తు రంగుబొరిమి బ్రిటిషురాజ్యములోనికి లాగివైచిరి. రాజ్యమం

దే భూమియంతయునని ధర్మము నెలకొల్పిరి. న్యాయమంతయు రాజ్యమే చేబట్టవలెనని గ్రామసంస్థల నెల్లెడల మటుమాయమొనర్చి కోర్టులు మునసబులు జడ్జీలు మొదలగు సంస్థలన్నియు బ్రభుత్వవిధానములోనికి దింపి ప్రజలలో వివాదకాంక్ష పెరుగుటకు సత్యలోపనమునకు అబద్ధవ్యాపకమునకు గారకులైనారు. పరిశ్రమలెన్ని యట్లు నశించిపోయినను వారు జోక్యముకలుగజేసికొనక పోవుటయేకాక యే మేమభిరుచులేయే ప్రజలకేయే వస్తువులందుగలవో బరిశీలించి తమ స్వదేశీయకర్మాగారములద్వారా యాయావస్తువులు చేయించి తెప్పించి ప్రజలమోహపించి మురిపించి యిక్కడ నాయాప్రజల పరిశ్రమలన్నియు విగతజీవములై మడయుటకు గారకులైనారు. మునుపటివలెనే కోట్లకొలది తమదేశమునకు బోవుచున్న ద్రవ్యప్రవాహమునకు దామును జేయూత యిచ్చి రివర్సుకవున్సిలు బిల్లులు కర్రెన్సీరిజర్వు చిత్రములు మొదలగు చమత్కారములెన్నోచేసి దేశమును క్రమక్రమము కూటికి గుడ్డకు మొగము వాచినట్లు చేయగల్గినారు.

ఇప్పటికి జగత్తులో మానవుడు సముపార్జించిన భౌతిక విజ్ఞాన ఫలితములైన యయోమార్గములు ఆవిరియంత్రములు తంతివార్తలు మొదలగునవి యెల్లనీదేశములో బ్రిటిషుప్రభుత్వము ప్రవేశపెట్టినగనే యవి బ్రిటిషుప్రజలకు వేగముగా



దేశములోని మారుమూలలకు బోయి ముడివస్తువుల చౌకగ సంపాదించుకుటను వారిరాజ్యమున కపాయము వచ్చినప్పుడు నిమేషమాత్రమున గ్రమ్ముకొనుటకును ఇట్టి సంస్థలకొఱకేర్పడిన బ్రిటిషుకంపెనీలు బాగుపడుననియే మనము గ్రహింపవచ్చును. ఇవిప్రజలకే యగునెడల దేశములో నొకదేశీయ సంఘముక్రింద నొక్క రైలుమార్గముండెనేమో పరికింపుడు. దేశీయులెక్కు మూడవక్లాసు బండివలననేకదా వీరికింతయాదాయము వచ్చుచున్నది. దానికింతవర కేసౌకర్యము కల్పింపకపోవుటయేకాక దొరలెక్కు బండిలోగల యపూర్వసౌకర్యములెట్లు రోజురోజు నభివృద్ధిచేయుచున్నారో తిలకింపుడు. కావున నియ్యవన్నియు వర్తకశిఖామణులగు బ్రిటిషుప్రజలచాకచక్యమున వారి స్వలాభము కొరకు పన్నినపన్నాగములే యనిన నేమియు నతిశయోక్తి దోషముపట్టదు. కావున బ్రిటిషుప్రజలచేతిలో బడితిమని సంతసించిన మన సంతోషము వట్టి భ్రమకాని మనలాభమేమియు నందువలన సిద్ధింపలేదు.

ఇట్లు బ్రిటిషుప్రభుత్వము ప్రజలసమ్మోహనాస్త్రబద్ధులుగ నొనర్చి యాయుధములూడ్చి నిరాయుధులొనర్చి నిరుపేదరికమిచ్చి తమ స్వీయలాభమునకై రాజ్యము పాలించుచుండ మరల నొకముప్పు వారేతెచ్చుకొనిరి. వారినౌకరీలకై యుందరిని నింగ్లాండునుండి రప్పింపజాలక యిక్కడ గొన్ని గుమా

స్థాప్యాక్టరీల కట్టించిరికదా! ఆవిద్యాలయములో గడతేరి బారిష్టా మొదలగు ఉన్నత విద్యలకు నింగ్లాండు సహితముపోయి వారివిద్యలో వారినే మించగల్గిన యాంగ్ల విద్యార్థికులెందరో కొలదికాలమునకే మన భారతభూమిలో బయల్దేరిరి. వీరు ప్రపంచక పాలనాసంస్థల గురించి చదివి బ్రిటిషుప్రజల స్వాతంత్ర్యవైభవములారసి తమ బానిసత్వముయొక్క నైచ్యము గ్రహింపగల్గిరి. ఆంగ్లేయుల రాజకీయ తత్వమంతయు నాపోశ సముబట్టినవిద్వాంసులూహాప్రపంచమునబడిమన దేశభావ్యభివృద్ధియెట్లుఅనివితర్కించుకొని బ్రిటిషురాజనీతినే యవలంబించిన గాని పనులుసాగవని చక్కగ నిరూపించుకొని లోలోన దమకెంత దేశభక్తి ప్రేరితాగ్ని ప్రజ్వరిల్లుచున్నను గార్యవాదులై యొక చిన్నయుద్యమమును బ్రారంభించిరి. అదియే దేశీయ మహాసభయనబడు కాంగ్రెస్సు ప్రతిష్ఠాపనము- ఇదియేస్వరాజ్యప్రతిష్ఠాపనమందలి పునఃప్రయత్నములలో రెండవది. కాని యిది యవసరజ్ఞులు, కార్యవాదులునగు విద్యార్థికులచే బ్రేరేపింపబడియుండుటచేతను, దేశములోగల ప్రజల యలసత్వాచలత్వముల వలనను చతురోపాయమగు దండోపాయమువదలుకొని మొదటిదైన సామోపాయపద్ధతికి దిగనలసివచ్చినది. ఈకాంగ్రెస్సు క్లుప్తముగా నెట్లు నడచినదో యొక్కొక్కటియు దడవిజూచి యూపైనాలోచింతముగాక!



## 1885 మొదటి కాంగ్రెసు—బొంబాయి

చెన్నపట్టణములో 1884 సంవత్సరము డిశంబరులో జరిగిన దివ్యజ్ఞానసమాజ వార్షికసమావేశ సందర్భమున వచ్చిన ప్రముఖులలోగొందఱు దివానుబహద్దరు రఘునాథరావుగారి యింటగుమిగూడి దేశభక్తిపూరితులై యేవిధముచేనైన భారతదేశమునకంతకు బ్రాతినిధ్యమువహింపగల్గిన యొకసమావేశము సమకూర్పవలెనని గాఢముగ సంకల్పించిరి. నాల్గుదిక్కులలో గల హైందవులెల్లరు నొకరినొకరు పరిచయపఱచుకొని యొక్క యాదర్శముగల రాజకీయసంస్థలో బనిజేయుట కవకాశము గల్పించుకొనుటకే యీసంకల్పము చేయుచున్నామని వారుతలచిరి. ఇట్టిమహాసంకల్పమున కట్లుసముకూడిన పదునేడ్గుర దివ్యనామములు వశనము మఱువదగినవికావు:— 1 ఎస్. సుబ్రహ్మణ్యయ్యరు. 2 పి. రంగయ్యనాయుడు. 3 పి. ఆనందాచార్యులు చెన్నపట్టణమునుండియు 4 నరేంద్రనాథసేను 5 సురేంద్రనాథబెనర్జి. 6 మనోమోహన్‌గోష్. 7 చారుచంద్రమిత్తర్, బెంగాలునుండియు 8 వి. యన్. మండలిక్, 9 కే. టి. తిలాంగు 10 దాదాభాయినౌరోజీ 11 విజయరంగ మదలియార్ 12 పాండురంగగోపాలు బొంబాయినుండియు 13 సర్దారుదయాలుసింగు 14 హారిశ్చంద్ర యునైటడు ప్రావిన్సునుం

డియు, పంజాబునుండి, 15 కాశీప్రసాదు 16 పండిత లక్ష్మీ నారాయణులును 17 శ్రీరామ్‌అనునాతడు అయోధ్యనుండి యువచ్చి యీమహాసంకల్పమునకు ప్రాతిపదికలైనిల్చిరి. ఈ సంకల్పమే కార్యరూపము దాల్చుటకు మార్చి 1885 సంవత్సరములో దేశములో ప్రముఖులకెల్లర కొక్కసందేశము పంపబడి 1885 డిశంబరులో పూనాపట్టణము కాంగ్రెస్సు సమావేశము జరుగుననియు నందులకు దేశములోగల ప్రజాసంస్థలేవియైనను ప్రతినిధులను బంపవలెననియు నొకసందేశమంపబడినది. అందుమీదనే ప్రధమజాతీయమహాసభ డిశంబరు 28 వ తేదీ 1885 సం॥ రమున బొంబాయిలో గోకుల్దాసు తేజ్పాలు సంస్కృతవిద్యాలయమున సమావేశింపబడినది. మొత్తము 72 రు ప్రతినిధులువిచ్చేసిరి. ప్రభుత్వోద్యోగులైయుండియు దేశభక్తులగు కొందఱుప్రేక్షకులుగా గూడదయచేసియున్నారు. ఉమేశచంద్ర బెనర్జీ ప్రధమాధ్యక్షుడుగా నెన్నుకొనబడినాడు. ఆతడేయీసభోద్దేశములు ఈక్రిందివిధముగ నిర్వచించియున్నాడు. (1) దేశములోగల వివిధప్రాంతముల దేశాభ్యుదయాభిలాషులలో నన్యోన్యస్నేహసంపత్తి కలిగించుకొనుట (2) దేశములోగల వివిధమత, జాతి, ప్రాంతికప్రత్యేకత్వద్యోకత దురభిమానములబోగొట్టి రిప్పన్‌దొరవారి ప్రఖ్యాతప్రభుత్వమునందు దేశీయాభ్యుదయ కారణమగు హైందవజాతీయతాభినివేశముకల్గించుట (3) విద్యాధికుల సంవాదమువలన దేశములోగల సాంఘికవిషయ సమస్యలపై శాస్త్రీయ ప్రామాణికసదభిప్రాయముల సంగ్రహించుట (4) ప్రజాబాహుళ్యమునందుపకారకములగు రాజకీయ మార్గముల రాజకీయవిద్యావేత్తలు రాబోవు 12 మాసములలో నవలంబింపవలసిన విధానముల నిర్ణయించుట. ఈనాల్గును ప్రధానోద్దేశములుగా సభాధిపతి నిర్వచించినతరువాత 9 తీర్మానములు సక్రమముగా నుపపాదింపబడి చర్చింపబడి తీర్మానింపబడినవి.



మొదటితీర్మానము. యిండియన్ రాజ్యాంగవిధానమును విచారించి విమర్శించుటకొక రాయల్‌కమిషన్ కోరుచున్నది.

2 వది. యిండియాకౌన్సిల్ను రద్దుపఱచుటకు గోరుచున్నది.

3 వది. అప్పుడున్న శాసననిర్మాణసభలలో ఎన్నుకొనబడిన ప్రతినిధులవిడవలెనని కోరుచున్నది.

4 వది. ఐ. సి. యసుపరీక్షలు హిందూదేశములో జేయవలెనని ప్రార్థించుచున్నది.

5, 6 లు సైనికవ్యయము తగ్గింపవలసినదని ప్రార్థించుట.

7 వది. బర్మాను హిందూ ప్రభుత్వముదు లాగుకొనుట న్యాయముకాదని నివేదించుట.

8 వది. ఈతీర్మానములన్నియు దేశములోగల రాజకీయ సంస్థలకుబంపి చర్చింపనిచ్చుట.

9 వది రెండవకాంగ్రెస్సు కలకత్తాలో డిశంబరు 28 వ తేదీ 1886 సంవత్సరమున సమావేశింపబడవలెననుట.

ఇంతటితో బ్రథమకాంగ్రెస్సు జయప్రదముగ ముగిసినది.

## 1886 రెండవకాంగ్రెస్—కలకత్తా

రెండవకాంగ్రెస్సు సమావేశింపబడునాటి కీదేశములో గొప్పచలనము కల్గినది. పలువురు పలుతావులనుండి సక్రమముగనెన్నుకొనబడి 434 గురు ప్రతినిధులు విచ్చేసిరి. ఆహ్వానసంఘమేర్పడి డాక్టరు ద్విజేంద్రలాలు మిత్రయను వాని పురుస్కరించుకొని వీరలకెల్లరకు స్వాగతమీయబడినది. దాదాభాయి నౌరోజీ సభాధ్యక్షుడైనాడు. ద్విగుణీకృతోత్సాహముతో 15 తీర్మానములు చర్చింపబడి తీర్మానింపబడినవి. అధ్యక్షుడు కాంగ్రెస్సు రాజకీయ ప్రత్యేకసంస్థయనియు దేశమునకంతకు సంబంధించిన రాజకీయవిషయములే యిందుజర్చింపబడవలెననియు సాంఘికాదికములందులకై యేర్పడిన ప్రత్యేకసంస్థలున్నవనియు నిర్వచించెను. తీర్మానములన్నియు సమర్థులచే మహోపన్యాసములతో జర్చింపబడెను.



1 వ తీర్మానము- విక్టోరియా మహారాజ్ఞికి ఆశీర్వచనములు.

2 వది. ప్రజలలో దినదినము పెచ్చుపెరుగుచున్న వేదరికముగూర్చి వివరించుచు బ్రజాస్వామిక సంస్థల ప్రతిష్ఠించుటయే ప్రజాభ్యుదయ కారణమగునని సూచించుట.

3 వది. శాసననిర్మాణసభలో నెన్నుకొనబడిన సభ్యులుండవలెనని కోరుట.

4 వది. పై తీర్మానములోనున్న దానికి కొన్ని వివరములు

5 వది. ప్రజాస్వామిక సంస్థలప్రతిష్ఠాపనములకనుమతి యిండియా మంత్రివలనపొంది యొకవిచారణసంఘము నేర్పాటుచేయవలసినదని రాజప్రతినిధిని వినయపూర్వకముగా బ్రార్థింపుడని దేశములోగల రాజకీయ ప్రజాసంఘములన్నిటిని హెచ్చరించుట.

6 వది. ఐ. సీ. యస్ పరీక్షలగూర్చిన విచారణ సంఘము.

7 వది. దాని రిపోర్టునంగీకరించుట.

8, 9, 10 లు న్యాయవిచారణసంబంధమైన మార్పులు కొన్ని కోరుట.

11 వది కార్యనిర్వాహకవర్గమునుండి న్యాయవిచారణము వేరుచేయుమని కోరుట.

12 వది సైన్యములో దేశీయులవాలంటీర్లుగా జేర్చుకొనుమనికోరుట.

13 వది దేశములోగల ప్రధానస్థానములన్నిటిలో కాంగ్రెస్సుసంఘములు నిర్మించుట.

14 వది మూడవకాంగ్రెస్సు చెన్నపట్టణములో జరుగవలెనని తీర్మానించుట.

15 వది తీర్మానములు. రాజప్రతినిధికి విక్టోరియామహారాజ్ఞికి యిండియామంత్రికి పంపుకొనుట.

ఈతీర్మానములతో జయప్రదముగ రెండవకాంగ్రెస్సు ముగిసినది.

1837 మూడవకాంగ్రెస్సు- మెడ్రాసు.

చెన్నపట్టణములో సర్. టీ మాధవరావుగారినిపురస్కరించుకొని యాదరసన్మానసంఘ మేర్పడినది. విరివిగ ద్రవ్యము ప్రోగుచేయబడినది. అత్యంతోత్సాహముతో 607 గురు ప్రతినిధులును మూడువేలమంది ప్రేక్షకులును దయచేసిరి. బద్రుద్దీన్ తయ్యాబ్జీ యధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. మొత్తము 11 తీర్మానములు చర్చింపబడినవి. ఈకాంగ్రెస్సు సమావేశమునందే మొదటివిషయనిర్ణాయకసంఘము సమకూర్చబడినది. కాంగ్రెస్సు సంస్థాక్రమమునకు విధినిర్వచనమునకొరకయుపసంఘముకూడ నేర్పడినది. కాంగ్రెస్సు సంవాదములలో



జాలమంది ప్రముఖులు కలుగజేసికొని మహోపన్యాసములొసంగిరి.

అందు సురేంద్రనాథబెనర్జీ, యెర్డ్లీనార్టన్, పండితబిషన్ నారాయణధర్, పండిత మదనమోహన మాలవ్యాగారు ముఖ్యులు. వీరి యుపన్యాసములు జగజ్జేగీయమానములుగ బ్రజలుభావించిరి. మొదటితీర్మానము కాంగ్రెస్సంస్థాక్రమమునకువిధి. నిర్వచనమొనర్చుటకొరకయుపసంఘము నిర్మించుట.

2 వది శాసననిర్మాణ సభలగూర్చిన పూర్వపు తీర్మానము పునఃప్రవచనము.

3 వది న్యాయవిచారణముగూర్చిన సలహా.

4 వది సైనిక విద్యాలయములు ప్రతిష్ఠింపబడుటకును దేశీయులకు సాంగ్రామిక శిక్షనొసంగుటకును కోరుట.

5 వది. సైన్యములో దేశీయులవాలంటీర్లుగా జేరనిచ్చుట

6 వది వేయిరూపాలలోపు ఆదాయము కలవారలకు రాబడిపన్ను కొట్టివేసి సన్నరకముబట్టల దిగుమతీమీద పన్ను వేయుమని కోరుట.

7 వది పారిశ్రామికవిద్య నేర్పవలసినదని కోరుచు దేశీయకార్మిక వృత్తుల బ్రోత్సహింపవలసినదనిప్రభుత్వమువారిని గోరుట.

8, 9, 10, 11 తీర్మానములు కార్యనిర్వాహక సంబంధములైనవి.

ఈతీర్మానములతో మహాసభ ముగిసినది.

### 1888 నాల్గవకాంగ్రెస్సు—అల్లాహాబాదు

మూడు కాంగ్రెస్సుసభలు జరిగినప్పటికే ప్రభుత్వవర్గములో మూతివిరుపులు, ముక్కువిరుపులు ప్రారంభించినవి. డఫ్రినుదొర దీనిని రాజద్రోహసంఘమని పేరుపెట్టెను. కాల్విను దొర అల్లాహాబాదులలోనినాల్గవకాంగ్రెసు జరుగకుండ బోవలెనని యనేకచిత్రములైన యడ్డంకులు గల్పించి ప్రతిఘటించెను. కాని ప్రజలలో బ్రహ్మాండమగు ప్రబోధముగలిగినది. పండిత అయోధ్యానాథుని పురస్కరించుకొని సన్మానసంఘము మిగుల పరిశ్రమయొనర్చి స్వాగతప్రయత్నములు ప్రభుత్వవర్గములొసంగు నాటంకములన్నిటిని దాటి జయప్రదముగ జేయ గల్గినది. కావుననే ఈసమావేశమునకు 1248 గురు ప్రతినిధులును 5000 మంది ప్రేక్షకులును మహోత్సాహముతో దయచేసిరి. యూలుదొరను సభాధ్యక్షునిగా నెన్నుకొన్నతరువాత 17 తీర్మానములు చర్చింపబడి తీర్మానింపబడినవి.

ఇప్పుడు దేశములో నింతగా ప్రేమింపబడి పూజింపబడుచున్న లాలాలజపత్రాయి ప్రప్రథమమున నీసమావేశమునందే ఒక మహోపన్యాస మొసంగెను. మరియు నుత్తర



సర్కారులనుండి యాంధ్రనాయకుడగు న్యాపతి సుబ్బారావు గారీసమావేశమునందే యొకతీర్మానము బలపరచుచు ప్రథమాంధ్రోపన్యాసకుడయ్యెను. పల్వురు మహోపన్యాసకులీకాంగ్రెస్సు వేదిక నలంకరించిరి.

1 వ తీర్మానము. శాసననిర్మాణసభలలో నెన్నికసభ్యులగూర్చిన పూర్వతీర్మానము పునఃప్రవచన మొనర్చుట.

2 వది. ఐ.సి. యసు పరీక్షలగూర్చి.

3, 4 లు. పూర్వన్యాయవిచారణ విషయకతీర్మానముల పునఃప్రవచనము.

5 వది. పోలీసు పరిపాలనము సరిగాలేదనియు అనుద్యోగీయసభ్యులతో గూడినయొక విచారణసభ నేర్పాటుచేయవలసినదని ప్రభుత్వమును బ్రార్థించుట.

6 వది. సైనికులుగా దేశీయుల స్వీకరించుటలో పూర్వతీర్మానముల పునఃప్రవచనము.

7 వది. అప్పటికన్న ఆబ్కారీపద్ధతివలన త్రాగుడెక్కువగుచున్నదనియు ప్రభుత్వమువారు త్రాగుబోతుతనము తగ్గుటకు దగిన క్రొత్తవిధాన మాలోచింపవలసినదని ప్రార్థించుట.

8 వది. రాబడిపన్ను తగ్గింపవలెనని.

9 వది. సాధారణ పారిశ్రామిక విద్యావ్యాపనము కొఱకు.

10 వది. ప్రజలలోగల పేదరికముగూర్చి విచారణసంఘము నిర్మింపవలసినదని ప్రభుత్వమునుగోరుట.

11 వది. పైనితీర్మానములన్నియు రాజప్రతినిధిద్వారా బ్రిటిషుప్రభుత్వము పంపుకొనవలసినదనియు నవసరమైనచో నొకవిచారణసంఘము కటాక్షింపవలసినదనిపార్లమెంటునప్రార్థించుట.

12 వది వ్యభిచారముగూర్చి బ్రిటిషుప్రభుత్వవారు హిందూదేశములో జేయుచున్న ప్రతిఘటన ప్రయత్నములకు సంతసించుచు దేశీయులుకూడ తోడ్పడుదుమని మనవిచేయుట.

13 వది. విషయనిర్ణయసభలో తీర్మానింపబడవలసిన తీర్మానముల నెద్దానికైన హిందువులుకాని మునల్మానులుకాని యేకగ్రీవముగా నుంచబడినవారలు ప్రతిఘటించినచో దీర్మానింపబడకూడదు.

14 వది. మెడ్రాసు బొంబాయి రాజధానులలో బ్రవేశపెట్టబడుచున్న పర్మినెంటు రెవిన్యూ సెటిల్మెంటుగూర్చి యా యాకాంగ్రెసు కమిటీలువిచారించి రిపోర్టులబంపుడని కోరుట.

15 వది. ఉప్పుపన్ను హెచ్చింపబడినందులకు అసమ్మతిచూపుట



16 వది. ఐదవ కాంగ్రెస్సు బొంబాయిరాజధానిలో జరుగుట.

17 వది. అదివరకు బనిచేయుచున్న ఎ. ఓ హ్యూము దొరను కార్యదర్శిగా కాంగ్రెస్సునకు నియమించుట.

ఈతీర్మానములయిన పిమ్మట సభముగిసినది. ఈకాంగ్రెస్సులోనే ప్రతినిధులు ఒకనియమిత ద్రవ్యము నొసంగవలసినదని నిర్ణయింపబడి యిట్లువసూలుచేయుట ప్రారంభింపబడినది.

1889 5 వ కాంగ్రెసు- బొంబాయి.

బొంబాయిపట్టణము ఫిరోజిషా మెహతాను పురస్కరించుకొని బ్రహ్మాండమగు స్వాగతముజరిగినమీదట నైదవ కాంగ్రెస్సు సర్ విల్లియము వెడ్డర్బర్ను దొర యాధిపత్యమున సమావేశమైనది. చిత్రముగా నాసంవత్సరసంఖ్యతో సమానముగ 1889 గురు ప్రతినిధులువిచ్చేసిరి. నాల్గువేలమంది ప్రేక్షకులున్నారు. మొదటికాంగ్రెస్సునందెవ్వరే మహమ్మదీయులున్నను నీకాంగ్రెస్సు వచ్చునప్పటికి మునల్మానులలో సహితము కాంగ్రెస్సుపై భక్తికుదిరి 254 గురు మహమ్మదీయ ప్రతినిధులువిచ్చేసిరి. పార్లమెంటుమెంబరగు సర్చార్లస్ బ్రాడ్లాదొర కాంగ్రెసు నాశీర్వదించుటకైవచ్చి యేకగ్రీవస్వాగత మిూస మూహోమున బొందగల్గినాడు. ఈయేడు కాంగ్రెస్సు రంగము

నకు బాలగంగాధర తిలక్కును గోపాలకృష్ణగోఖేలును ప్రతిని ధులై వచ్చి తీర్మానముల చర్చలో బాల్గొని మహోపన్యాసము లిచ్చియున్నారు. మొత్తము 12 తీర్మానములు చర్చింపబడి తీర్మానింపబడినవి.

1 వది బ్రాడ్లాదొరకు సన్మానపత్రమిచ్చుటకు

2 వది. శాసననిర్మాణసభల సత్కారణమునకు స్కీము బ్రాడ్లాదొరకొనంగి పార్లమెంటులో నొకబిల్లు తెమ్మని కోరుట.

3 వది. పూర్వపు తీర్మానములన్నిటిని గుదిగుచ్చి ప్రవచించుట.

4 వది. ఆబ్కారీగురించిన చర్చలో పార్లమెంటులో బనిచేసిన కానీ, స్మిత్తుదొరల నభినందించుట.

5 వది. సివిల్‌సర్వీసు పరీక్షలవిషయమై వయస్సు 19 నుండి 23 వెచ్చించినందులకు బ్రిటిషుప్రభుత్వము నభినందించుచు యిండియాలోగూడ పరీక్షలు జరుపవలెనని ప్రార్థించుట.

6 వది. ఆయుధచట్టమునకు సవరణమొనర్చునని ప్రార్థించుట.

7 వది. పెర్మనెంటు సెటిల్మెంటు పునర్విచారణమునకు దెమ్మని ప్రభుత్వమునుగోరుట.

8 వది. వెండిమీాదపన్ను రద్దు వేయుమనికోరుట.



9 వది కామనులసభకు హైందవుల ప్రార్థనల నివేదించుకొనుట కవకాశము కల్పించుటకు బ్రాడ్లాదొర నొకపిటీషన్ హిందూప్రజల తరపున దాఖలుచేయునని.

10 వది (క) కాంగ్రెసు ప్రతినిధులసంఖ్య వేయింటికి నిబద్ధమొనర్చుట.

(ఖ) పండిత అయోధ్యనాథ్ హ్యూముదొర యింగ్లాండు వెళ్ళిన తేదీలగాయతు కార్యదర్శిగనుండును.

(గ) కాంగ్రెసుస్థాయిసంఘములు రాబోవు సమావేశములోపల నిబంధనల నిర్ణయించి పంపుట.

(ఘ) బ్రిటిషుకాంగ్రెస్సు యేజన్సీకి నిర్వాహకుల నేర్పరచుట.

(చ) ఇంగ్లాండులో ప్రచారమునకు గొందఱు ప్రతినిధులపంపుట.

(ఛ) 45000 రూప్యములు ఖర్చులకు స్థాయిసంఘములు సమకూర్చి పంపుట

11, 12 వందనములు.

13, 14 రాబోవు కాంగ్రెసుస్థాన నిర్ణయము. కార్యదర్శి నిర్ణయము

ఈతీర్మానములతో నైదవ కాంగ్రెసు ముగిసినది.

ఈక్రిందిపట్టిక మూలమున నింతటినుండి 1898 సంవత్సరమువఱకు సర్వసామాన్యపద్ధతులలో నేజరిగిన కాంగ్రెస్సుల వివరము తెలిసికొనగును.

| సంవత్సరము | కాంగ్రెసు సంఖ్య | అధ్యక్షుడు | ప్రతినిధులు, | సన్మానసంఘాధ్యక్షుడు | తీర్మానము సంఖ్య | విశేషములు. |
|---|---|---|---|---|---|---|
| 1890 | 6 వది కలకత్తా | ఫిరోజిషా మెహతా | 702 | మనోమోహాన్‌గోషు. | 15 | |
| 1891 | 7 వది నాగపూరు | పి. ఆనందాచార్యులు | 812 | సి. నారాయణసామినాయుడు | 18 | |
| 1892 | 8 వది అలహాబాదు | వుమేశచంద్ర బెనర్జీ | 625 | పండితచితాంబరనాథు | 22 | |
| 1893 | 9 వది లాహోరు | దాదాభాయి నౌరోజీ | 837 | సర్దారుదయాల్సింగు | 23 | |
| 1894 | 10 మెద్రాసు | ఆల్ఫ్రెడ్‌వెబ్బు | 1, 163 | పి. రంగయ్యనాయుడు. | 27 | |
| 1895 | 11 పూనా | సురేంద్రనాథ బెనర్జీ | 1, 584 | యస్. యమ్ ఖైద్ | 26 | |
| 1896 | 12 కలకత్తా | మహ్మాదురహీము తులాశాయనీ | 784 | రోమేశ్చంద్ర మిత్రా | 24 | |
| 1897 | 13 అమరావతీ | సి. శంకరనాయర్ | 692 | కపర్ది | 21 | |
| 1898 | 14 మెడ్రాసు | ఆనందమోహన్ బోసు | 614 | న్యాపతిసుబ్బారావు | 27 | |

ఇరువదవ శతాబ్ద మికమూడుదినములలో బాంకిరం [illegible] గ్రెస్సు లక్నోపురంబున సమావేశమై 740 మంది ప్రతినిధులతో 3500 మంది ప్రేక్షకులమధ్య రమేశచంద్రదత్తు సభాధిపత్యమున సుమారు 20 తీర్మానములొనర్చినది. అందుగాంగ్రెసు నిబంధనలగూర్చి యొనర్పబడినది ముఖ్యమైనది. కాంగ్రెస్సుయొక్క ప్రధానోద్దేశ్యము హిందూసామ్రాజ్యములోని ప్రజల యభివృద్ధి శాసనానుకూల మార్గముల పెంపొందించుటయే యని నిర్వచింపబడినది. దేశమునందుగల రాజకీయ సంఘములవలనను ప్రజాసంఘములచేతను ఎన్నుకొనబడిన ప్రతినిధులెల్లరతోడను సంవత్సరమునకొకసారి నిర్ణయింపబడిన కాలమున బ్రదేశమున, కాంగ్రెస్సుసమావేశింపబడుననియు నఖిలభారత స్థాయీసంఘమున నిర్ణయించినచో నసాధారణసమావేశముగూడ వారినిర్ణయము ప్రకారము జరుగవలెననియు ఈప్రణాళికయంతయు నొకస్థాయిసంఘముచే పాలింపబడుననియు నయ్యది సంవత్సరసమావేశమున నెన్నుకొనబడిన 40 మందిసభ్యులతో నుండుననియు రాష్ట్రకాంగ్రెస్సు సంఘము లేర్పడవలెననియు నివివాని రాజధానులలో సాంవత్సరిక మహాసభల సమావేశమొనర్చి కాంగ్రెస్సు తీర్మానములలో బెట్టవలెననియు ఈరాష్ట్రసంఘములే రాబోవుకాంగ్రెస్సు సభాధ్యక్షుని నెన్నుకొను నధికారము కలిగియుండుననియు మొదలగు సక్రమనిబంధనలు తీర్మానింపబడినవి. ఇంతటినుండి కాంగ్రెస్సు కార్యక్రమమంతయు నీప్రణాళిక ననుసరించియే జరుగుచు వచ్చినది. ఈక్రింది పట్టికననుసరించి 1906సంవత్సరము వరకు జరిగిన కాంగ్రెస్సుల వివరము తెలిసికొనవచ్చును.

| సంఖ్య | స్థానము | సంవత్సరము | అధ్యక్షుడు. | ప్రతినిధులు | సన్మానసంఘాధ్యక్షుడు | తీర్మానముల సంఖ్య. |
|---|---|---|---|---|---|---|
| 16 | లాహోరు | 1900 | యర్. జి. చంద్రవార్కరు | 567 | కాలీప్రసన్నరాయి | 25 |
| 17 | కలకత్తా | 1901 | డి. యి. వాచా | 896 | జగదీంద్రనాధరాయబహద్దరు | 23 |
| 18 | అహ్మదాబాదు | 1902 | సురేంద్రనాధ బెనర్జి | 471 | అంబలాదేశాయి | 23 |
| 19 | మెడ్రాసు | 1903 | లాల్ మోహన్ ఘోషు | 5380 | నవాబుసయ్యదు మహమ్మదుసాహేబు | 15 |
| 20 | బొంబాయి | 1904 | సర్ హెన్రీకాటర్ | 1010 | పిరోజిషామెహతా | 22 |
| 21 | కాశీ | 1905 | గోపాలకృష్ణగోఖేలు | 758 | మధోలాల్ | 25 |



ఇంతవఱకు నిరువదియొక్కసారి కాంగ్రెస్సుసమావేశమై బ్రిటిషుప్రభుత్వమునుప్రార్థేయపూర్వకముగాలోపములు తీర్చవలసినదనియు నీసౌకర్యము కల్గింపవలసినదనియు ప్రార్థించుచునేవచ్చినది. తీర్మానము లెప్పటి పే మొత్తముమీద జర్గింపబడినవి. బ్రిటిషుప్రభుత్వము ను మొత్తపుకోర్కెల దీర్పకపోయినను కాంగ్రెస్సుసభావేదికం పై గట్టిగ ఘాటీ కనంబరచిన పైఁందవులకు ఏవోబిరుదులిచ్చి యుద్యోగములిచ్చి గౌరవములోనంగి గౌరవించుచునేవచ్చిరి. ఈతరుణముననే ప్రపంచకమున రెండు యుద్ధములు జరిగియున్నవి. బోయరుయుద్ధము,ఇందు దక్షిణాఫ్రికా వారలగు బోయర్లు మన బ్రిటిషువారితో బోరాడి స్వాతంత్ర్యము సంపాదించిరి. బ్రహ్మాండవిస్తీర్ణ ప్రఖ్యాతులుగల పాశ్చాత్య ప్రభుత్వమగు రష్యాతో హోరాహోరీని బోరాడి జపానుకడుంగడు చిన్నదేశమయ్యు భరతవర్షములోనిదయ్యు జగజ్జేగీయమైన విజయముసంపాదించి రష్యాతో బాశ్చాత్యదేశములన్నియు దలవంచుకొనునట్లు చేసినది. ఈరెండు యుద్ధములను మన భారతీయులు గమనించుచునేయున్నారు. విగతజీవవైయై పడిపోయిన భారతస్వరాజ్యలక్ష్మి యీయిరువదియొక్క కాంగ్రెస్సు సమావేశములోని బిడ్డల యుపన్యాసములను జగత్తులోని యావిషయములును బరికించి కొంచెముకొనయూపిరిపీల్చుట కారంభించినది. దేశములో

జాతీయతాభినివేశము సంఘటిల్లినది. ఉత్తరమున లాలాలజపత్రాయి ప్రభృతులు దక్షిణమున సుబ్రహ్మణ్యయ్యరు ప్రముఖులు పాశ్చాత్యభాగమున తిలకుమహాశయాదులు ప్రాగ్భాగమున సురేంద్రనాధబెనర్జీ, బంకించంద్రచటర్జీ, శిశిరకుమారఘోషు మొదలగువారును అనేకవిధముల ప్రజలకు ప్రబోధమొనర్చుచున్నారు. ఇట్టి తరుణముననే కర్జనుదొర వంగదేశమును రెండుగావిభజించి ప్రజాప్రతిఘటనలన్నిటిని దృణీకరించి నాయకుల బత్రికల నిర్బంధింప మొదలుపెట్టి తనరాక్షసభావము కనంబరుప మొదలుపెట్టెను. వంగయువకులెల్లరు నిట్టి నైరంకుశ్యము సహింపక దశదిక్కుల మార్మోగునట్లు మహాందోళనము గావింపమొదలిడిరి. ఒకించుక మైకమువదలి విద్యార్థులు ప్రజాసమూహములు ద్విగుణితోత్సాహముతో వంగవిభజనాందోళనమునకు జేయూతనిచ్చుటకు సంసిద్ధులైరి. బ్రిటిషువస్తువుల బహిష్కరించుటయు స్వదేశవస్తువులనే స్వీకరింప గంకణము కట్టుకొనుటయే కర్జను ప్రభువునకు సరియైన ప్రత్యుత్తరమని బెంగాలు నాయకులెల్ల రుద్ఘోషించిరి. వారితో బెద్దలెల్లరు సానుభూతిజూపి కాశీకాంగ్రెసులోనే యాతీర్మానము లంగీకరించునట్లుచేసిరి. ప్రభుత్వము విచ్చలవిడిగ ప్రజానాయకుల బంధింప మొదలుపెట్టినది. ఇంగ్లాండు మొదలగు దేశములలో విద్యాభ్యసనార్థమేగితమదేశములోని గానిసత్వమున కేవగించు



గాని యుద్రేకమాపుకొనలేక చాలమంది యువకులు విప్లవకారుల సంఘములలో జేరి రహస్యముగ బ్రిటిషుప్రభుత్వమును భయపెట్టగలమను పేరాసతో నక్కడక్కడ బ్రజాకంటకులని పేరెన్నికగాంచిన ప్రభుత్వోద్యోగుల సంహరింప బన్నాగములు పన్నజొచ్చిరి. దేశమిట్టి యల్లకల్లోలసమయమున గలకత్తానగరమున యిరువది రెండవకాంగ్రెసు మహాసభాసమావేశము జరుపుట తిలకింపగల్గినది. కలకత్తాలో భవానీపూరునందలి రస్సారోడ్డుప్రక్క బ్రహ్మాండమంత కాంగ్రెసు సభామందిరము నిర్మింపబడినది. అదివరకెప్పుడెరుంగని సంఖ్యయగు 1663 రు ప్రతినిధులును 20,000 మంది ప్రేక్షకులును ఆసేతుహిమాచలపర్యంతముగల ప్రజలెల్లరు నక్కడయున్నంత యుత్సాహముతో సమావేశమైరి. ఈకాంగ్రెస్సభా ప్రారంభముననే బంకించంద్రచటర్జీ దేశమునకిచ్చిన "సుజలాంసుఫలాంమలయజశీతలాం" మను జాతీయగీతము మహాభక్తిశ్రద్ధలతో మొదటిసారిగా నమర్చబడి యాయిరువదివేల ప్రజలు నొక్కసారి నుచ్చైస్స్వరమున వందేమాతరం దివ్యమంత్రోచ్చారణ మొనర్చి పులకితగాత్రులై భక్తిబాష్పములు రాల్చిరి.

తరువాత డాక్టరు రసవిహారఘోషు సన్మాన సభాన్యతుడు కావున విపులముగా ప్రభుత్వమువారి రక్షణ నిరంకుశ పద్ధతుల నన్నిటిని విన్నవించి ప్రతినిధులకు స్వాగతమొ

నర్చెను. సక్రమముగా దాదాభాయినౌరోజీ హైందవవృద్ధ ప్రపితామహాబిరుదాంకుడై యధ్యక్షుడవి కెన్నుకొనబడి తనప్రారంభోపన్యాసమునందే హిందూదేశము స్వరాజ్యము సత్వరముగా గోరుచున్నదని యుద్ఘోషించెను. స్వరాజ్యపదమును వివరించుచు నింగ్లీషువారికింగ్లాండులో నెన్నిహక్కులున్నవో యయ్యవన్నియు హైందవులు హిందూదేశమున బొందుటయే యని ప్రకటించెను.

ఇన్నినాళ్ళకు మరల దేశములో స్వరాజ్యమను పదముచ్చరింపబడినది. ఇంతటినుండి సామోపాయమున స్వరాజ్యపునరుద్ధరణ ప్రయత్నములోనే కాంగ్రెస్సుండవలెనని యిందువలన స్పష్టమగుచున్నది. ఇందులకు తార్కాణముగా నీసభావేదికపైనే కాలనీలలోగల ప్రభుత్వమువంటి స్వరాజ్యమునాకుగూడ గావలెననియు నట్టిది సిద్ధించుటకు నాల్గుసంస్కరణములు వెంటనే జరిగింపవలెననియు నొకతీర్మానము చర్చింపబడి యంగీకరింపబడినది. బహిష్కరణ తీర్మానము కూడ నత్యుత్సాహముతో దీర్మానింపబడినది. జాతీయవిద్యాప్రతిష్ఠాపనము, స్వదేశోద్యమము ఈనాల్గుతీర్మానములే యీ కాంగ్రెస్సులో ప్రధానములు దేశమెల్లెడల నీనాల్గుతీర్మానములు ఆచరణలో బెట్టించుటకు ప్రతినిధులత్యుత్సాహముతో సభముగించి యిండ్లకు వెడలిరి.



## 1907 23 వ కాంగ్రెస్సు సూరట్

కాంగ్రెస్సులో రెండుపక్షములేర్పడినవి. భయస్థులై చురుకుగా భోజాలనట్టియు సుఖప్రియు లుత్సాహశాలురు కానట్టియు దేశభక్తులెల్లరు మితవాదులుగను జాతీయాభ్యుదయమున కెంతటిత్యాగమైన జేయ సంసిద్ధులు కాదగినట్టియు సత్వర స్వరాజ్యాభిలాషులైనట్టియు దేశభక్తులెల్లరు జాతీయవాదులుగను విడిపోయిరి. అప్పటి కాంగ్రెస్సువేదికలపై బెద్దలమని తలద్రిప్పుకొనుచున్నవారే యెక్కుడుగ మితవాదవాసనలో బడుటచే నీసూరత్ కాంగ్రెస్సులో క్రిందటి కాంగ్రెస్సునాలుగు ప్రఖ్యాతతీర్మానములు మరలరాకుండ విషయనిర్ణాయిక సభలోనే జతగద్రొక్క సంకల్పించుకొనిరి. నిష్కారణముగా బ్రభుత్వముచే నెటకో గొంపోబడి నేటికివిడువబడిన లాలాలజపత్రాయి కధ్యక్షత పదవినిచ్చి గౌరవింపవలెనని జాతీయవాదులు ఘోషింప సక్రమముగ నెన్నుకొనబడుటలేదని హేతువుచే వానినిద్రోసివైచి డాక్టరురసవిహారఘోషుతోనే కాలక్షేపమొనర్ప సమకట్టిరి. దానితో సభాపతియెన్నికలోనే గందరగోళమైనది. అప్పటికాసభ యాపుచేయబడి మరల మరునాడుకూడినది. కానిసభాపతి యెన్నికమైనతోడనే జాతీయవాద నాయకుడగు బాలగంగాధర తిలకమహాశయుడు సభావేదికపై ప్రతిఘటించి సభనాపుజేయగోరుట కుపన్యసించ దలపెట్టెను.

అంత మహాసంక్షోభము సభలో బయలుదేరినది. అంతటనెట నుండియో యొకస్సైజారుజోడు తిలకునకు గురిచూడబడినను ఫిరోజిషా మెహతా సురేంద్రనాథ బెనర్జీలకు దగిలినది. దానితో నధ్యక్షుడు సభనాపుజేసి వెడలిపోయినాడు. మితవాదులెల్లరు మెల్లగనొకచిన్నసభ గావించుకొని దానినే కాంగ్రెస్సనియు గొన్నిగట్టి నిబంధనలతో జాతీయవాదులందు జేరకుండ జేసికొనియు నాత్మానందము నొందుచు దేశదౌర్భాగ్యము లూహింపక మామూలు ప్రార్థనా సమర్థనాభినందనా తీర్మానములతో గాలక్షేపము నర్ప మొదలిడిరి. వెంటనే తిలకుమహాశయునిపై నొకగొప్ప యభియోగము దెచ్చి ప్రభుత్వమువారు 6 సంవత్సరములు శిక్షతో నాతని మాండలేకోటలో బంధించిరి. విప్లవకారుల విజృంభణము పెచ్చుపెరిగిపోయినది. ప్రభుత్వమువారి ప్రజాశయాధఃకరణ పద్ధతులకు మితిలేకపోయినది. దేశమల్లకల్లోలము కాజొచ్చినది. ఇట్టిసంరంభ విజృంభణమునకు దాళలేక మితవాదులనైన జేజిక్కించుకొండమని ప్రభుత్వమువారు మింటోమార్లే సంస్కరణలను పేరుతో కొన్ని ప్రభుత్వ సౌకర్యములొనర్చిరి. విక్టోరియా మహారాజ్ఞి ఫర్మానాకు ఎడ్వర్డుచక్రవర్తి యర్ధశతాబ్దికముగ బునఃప్రవచన మొనర్చెను. ఇంక మితవాదులకు సంతోషము మిన్నుముట్టినది. విప్లవకారులు నొక్కివేయబడిరి. జాతీయవా



దులు కారాగారములందు జీర్ణశరీరులగుచుండిరి- కన్నుతెఱచి కొంచెము చలనము కనంబఱచిన స్వరాజ్యలక్ష్మి ప్రజలతో బాటు నిద్రాణమయి ప్రక్కకొఱగినది- ప్రభుత్వవర్గ మిప్పటి యట్లనేయున్నది. దేశము దినదినప్రవర్ధమానమై దౌర్భాగ్యస్థితికి బోవుచున్నది- ఈసందర్భములోననగా 1915 సంవత్సరమువఱకు నామమాత్రమైన కాంగ్రెస్సు జరుగుచునేయున్నది ఈప్రతిపట్టికవలన దానివివరము తెలియగలదు-



| సంఖ్య | సం॥రము | స్థానము | అధ్యక్షుడు | ప్రతినిధులు | సన్మానసంఘాధ్యక్షుడు | తీర్మానములు |
|---|---|---|---|---|---|---|
| 23 | 1908 | మెడ్రాసు | రసవిహారఘోషు | 626 | కె. కృష్ణస్వామి | 21 |
| 24 | 1909 | లాహోరు | మదనమో॥మాలవ్యా | 446 | హరికిషన్లాలు | 24 |
| 25 | 1910 | అల్హాబాదు | విల్లియంవెడ్డర్బర్న్ | 626 | పండితసుందర్ | 30 |
| 26 | 1911 | కలకత్తా | బిషన్నారాయణధర్ | 446 | భూపేంద్రనాథబాసు | 33 |
| 27 | 1912 | బాంకిపూర్ | ఆర్.ఎన్.ముధోల్కరు | — | మబరల్ హెక్కు | 24 |
| 28 | 1913 | కరాచీ | నవాబుసయ్యదు మహమ్మదుబహదరు | 550 | హరిశ్చంద్రవిష్ణుదాసు | 22 |
| 29 | 1914 | మెడ్రాసు | భూపేంద్రనాథబాసు | 866 | ఎస్.సుబ్రహ్మణ్యంయ్యరు | 26 |
| 30 | 1915 | బొంబాయి | ఎస్.పి.సింహా | | | |



ఈస్థావస్థ కాంగ్రెస్సునకు నడుచుచుండుకాలమునందే 1914 వ సంవత్సరమున యూరోపులో మహాసంగ్రామమొకటి యకస్మాత్తుగా చెలరేగినది. తుదకది ప్రపంచమంతయు నేకోవిధమున బట్టుకొట్టి మహాసంక్షోభము చేయజొచ్చినది. బ్రిటిషు ఫ్రెంచి రష్యా ఒకవైపు జర్మనీ ఆష్ట్రియా, టర్కీ ఒకవైపు శేరి ఐరోపాయ దేశము నొక సంగ్రామరంగముగనే మార్చియత్యంత ఘోరముగ బోరుసల్ప బ్రారంభించిరి. ఈతరుణములో బ్రిటిషుప్రభుత్వమువారు మెల్లమెల్లగ దీపిమాటలతో హిందువుల సంతోషపెట్టి యనేక వాగ్దానములకు సంకల్పములొనర్చిరి. హైందవులును బ్రిటిషుప్రభుత్వమే చిక్కులలో నున్నప్పుడు మరొకబాగున బ్రివర్తిల్లకూడదని ప్రభుత్వమునకు ధనసహాయములు విరివిగా జేయసాగిరి.

1916 సంవత్సరమున లక్నోలో అంబికా చరణమజుందారుని యధ్యక్షతక్రింద జరిగిన కాంగ్రెసులో మితవాదులతితీయవాదులిద్దరును రాజీపడి కలసికొనిరి. మరియు హిందూమునల్మానులకున్న రాజకీయాభిప్రాయ భేదములుకూడ సమీకరింపబడుటచే వారియైకమత్యముకూడ మొలకెత్త బ్రారంభించినది. భగవాను బాలగంగాధరతిలకు యానిబిసెంటమ్మయు గలసి హోమ్రూలులీగు అనుపేరుతో నొకసంఘమును నెలకొల్పి దేశములో గ్రొత్తసంచలనము కలుగజేయప్రయత్నించిరి.

ఆసంవత్సరము కారాగారవాస మందవలసివచ్చిన భగవాన్ తిలక్కు దేశమునకంతకు నాయకమణియై విరాజిల్లగల్గెను. దేశములో మరల గ్రొత్తయాశలు పొడసూపగల్గినవి. ఇందులకు దార్కాణముగా 17వసంవత్సరమున కలకత్తాలో జరిగిన కాంగ్రెస్సునకు యానిబిసెంటమ్మ సభాధిపత్యమువహించి నప్పుడు మిక్కిలి జయప్రదముగ కాంగ్రెస్సు పునరుజ్జీవింపబడునట్లు కనంబడినది. ఇదియట్లుండ పార్లమెంటులో ఆగష్టు 1917 సంవత్సరమున ఇండియా మంత్రియగు మాంటేగూ నిరాఘాటముగ హిందూదేశమునకు క్రమాగత స్వరాజ్యప్రతిష్ఠాపనమే బ్రిటిషుప్రభుత్వముయొక్క ముఖ్యోద్దేశమని యుద్ఘోషించెను. అదిగాక తానుస్వయముగా నిండియాకువచ్చి పలుపక్షములతో సంప్రతించి సంస్కరణముల ప్రణాళిక నేర్పరింతునని సూచించెను. పెండ్లివారియింట్లో సంరంభమువలె గొందఱు సంస్కరణములగూర్చి ప్రయత్నించుచుండ మఱికొందఱు రౌలట్టుకమిటీ నేర్పఱిచి దేశములోగల రాజద్రోహ విప్లవోద్యమముల యితివృత్తము విచారింప మొదలుపెట్టించిరి. ఇంతలోనే జర్మనీ యకస్మాత్తుగా లొంగిపోయి తెల్లబావుటాయెత్తి సంధిని భిక్షించినది. దీనితో నైరోపా మహాసంగ్రామము తుదముట్టినది. ఒకమూల సంస్కరణముల నిర్మాణము నింకొకమూల ప్రజాస్వాతంత్ర్యములన్నిటి నొకపోలీసువాని చేతిలోనిముడ్చుకొనగల్గు



రౌలటుబిల్లుల నిర్మాణముజరుగుచున్నవి. ఈయొడిదుడుకుసమయము 1918 సంవత్సరాంతమున ఢిల్లీ కాంగ్రెస్సు జరిగినది. 19 వ సంవత్సరప్రారంభమున దేశములో మరల గొప్పచారిత్రకవిషయములు సంఘటిల్లినవి. రౌలట్టుబిల్లులు సామ్రాజ్యనిర్మాణసభలో అనుద్యోగీయ సభ్యులెల్లరు పక్షవివక్షతలేకుండ గడుంగడుదీవ్రమున బ్రతిఘటించి మొఱపెట్టినను బ్రభుత్వమువారు అధికారసభ్యుల బలమున తీర్మానింపగల్గిరి. ఇదిజరిగిన వెంటనే గాంధీమహాత్ముడు 1915 సంవత్సరమునకే దక్షిణాఫ్రికానుండి తిరిగివచ్చియుండుటచే నీనాల్గువత్సరములు దేశపరిస్థితులు బాగుగాగమనించినవాడై రౌలట్టుచట్టములకు బ్రత్యుత్తరముగా సత్యాగ్రహ వ్రతదీక్ష, దేశమునకుపోద్బోధించెను. ఈసత్యాగ్రహ వ్రతమునే యెన్మిదిసంవత్సరములు దక్షిణాఫ్రికాలో భారతీయులచేత నవలంబింపజేసి కొన్నిదిగ్విజయములాతడందగల్గియుండెను. సత్యాగ్రహమనగా సత్యమని తాను నమ్మినది నాధారముచేసికొని యసత్యమును దౌర్జన్యరహితముగా బ్రతిఘటించుటయే! ఆత్మత్యాగముతో అహింసాధర్మముతో ప్రేమైకతత్వముతో ద్వేషరాహిత్యముతో జరుగవలసిన యీసత్యాగ్రహవ్రతము రాజకీయములగూడ నుపయోగింపగలమనియు దానట్టివిదివఱకే పరీక్షించి ఫలితమందియున్నాననియు నామహాత్ముడు దేశీయులెల్లర కుపదేశించి

ఆసేతు హిమాచలపర్యంత మొక్కతీవ్రసంచలనము కలుగజే
యఁగల్గెను. ఈరౌలట్టుచట్టముల కసమ్మతిజూపుచు ఏప్రిల్ 6వ
తేదీని దేశములోగల ముప్పదిమూడుకోట్ల ప్రజలును 7 1/2
లక్షల గ్రామములందును ఉపవసించి హర్తాలుచేయుటనియు
దేవాలయములలో మసీదులలో చర్చిలలో దైవప్రార్థనలు జరు
పుటనియు నాసాయంకాలము ప్రతిగ్రామమునందు గొప్పబహి
రంగసభలొనర్చి యీ రౌలట్టుచట్టముల రద్దుపఱచుటకు ప్రభు
త్వమును గోరుచు తీర్మానింపవలసినదనియు నేమాత్రపు దౌర్జ
న్యముకాని పరుషవాక్యముకాని పుట్టగూడదనియు నిర్దేశిం
చెను.

ఇదియిట్లుండ పాంచాలదేశమునకు గవర్నరుగానున్న
సర్ మేకేలు ఓడియరుద్వార యుద్ధసమయము నందునుండియు
ప్రజలననేకవిధముల నిర్బంధముల పాలుపఱచి గగ్గోలుగల్గించు
చుండెను. విచక్షతలేకుండ నిర్బంధముతో ప్రజలలోనుండి సై
నికులను ధనమును ప్రోగుచేసి యుద్ధరంగమున గుమ్మరించుటలో
మిన్నయనిపించుకొనగల్గెను. ఆతనికి ప్రజాభిప్రాయమనిన పర
మాసహ్యము. ప్రజానాయకులనిన పురుగులకంటె నీచముగ
నాతనికండ్ల కగపడుచుందురు. అట్టిచో ప్రజాసంచలనమునకు
దావలమైన యీ రౌలటు చట్టాందోళనము గొప్పవిప్లవముక్రిం
దదోఁచి యాతడుద్రేకించిన రోషానల జ్వాలలగ్రక్కుచు



ప్రజానాయకుల నిర్బంధించుటకు జూచినాడన్న నాశ్చర్యపడ
వలసిన యవసరములేదు. అమృతసరులోగల సత్యపాలు కిచ్లూ
యను నిర్వ్వరనాయకులును మహాత్ముని యాదేశానుసారము
రౌలట్టుచట్టాందోళనము జరిపింప కృతనిశ్చయులైరి. వీరలిదివ
ఱకే పౌరుల హృదయాకర్షణ మొనర్పగల్గిన ప్రజానాయకులగు
టచే ప్రజలును లక్షోపలక్షలుగ వీరిననుసరింపసాగిరి. ఇంకనోపిక
పట్టజాలక మార్చి 28 వ తేదీ 1919 సంవత్సరముననే డాక్టరు
సత్యపాలుపై నిర్బంధాస్త్రము వాక్ స్తంభనాస్త్రమును ఓడి
యరుప్రయోగించెను. అయినను మఱునాడు అమృతసరులో
బహుశాంతయుతముగా 30 వ మార్చి తేదీని గొప్పహర్తాల
ముజర్గించి ముప్పదివేలమంది సభికులతో గొప్పసభకూడ గా
వించిరి. తోకద్రొక్కిన త్రాచువలె రెట్టించిన కోపముతో
ఓడియరుకిచ్లూ, కోతుమల్, పండితదీనానాథ్, అనుభవానంద
స్వామి ప్రభృతులపైగూడ నిర్బంధవాక్ స్తంభనాస్త్రప్రయో
గములు ఏప్రిల్ 3 వ తేదీని సాగించెను. ఐనను దేశములో
నెల్లరితోబాటు నత్యంతజయప్రదముగ శాంతియుతముగ దౌర్జ
న్యరహితముగ 6 వ తేదీనిగూడ అమృతసరులో హర్తాలుద్వి
గుణీకృతోత్సాహముతో జరిగిపోయినది.

ఏప్రిల్ 9 వ తేది శ్రీరామనవమి యాటచే రామో
త్సవము ఎన్నడులేనివైభవముతో జరుగుటయేకాక మహాత్మ

దీయులుకూడ వేనవేలుత్సవములో బాల్గొని హిందూముసల్మానుల నైక్యముప్రకటింపగల్గిరి. డాక్టరు కిచ్లూ,సత్యపాలు ఇర్వురునోరెత్తకుండనే యీమహోత్సవమును బలుతావులనుండి తిలకించి యాప్రజాసముద్రము నుప్పొంగిపొరలజేసిరి. ఇదియు నోడియరు చెవులబడినతోడనే యాతడు కోపముచే నొడలుమఱచెను. నిప్పుద్రొక్కిన కోతివలె సంభ్రమాయత్తుడయ్యెను. కోపపూర్ణాయమానసుడై యారాత్రియే కిచ్లూసత్యపాలుర నెటకో రహస్యముగ గొంపోవబడునట్లుత్తరవులు జారీచేయించెను. మరునాడే వారలిర్వురు కమీషనరుకడకు రప్పింపబడి మోటారుకారులో నెటకో తీసికొనిపోబడిరి.

ఇట్టిదుర్వార్త యమృతసరు పట్టణములో తొలకరిమెఱుపువలె నొక్కసారిగ బ్రాకి యలముకొని లక్షోపలక్షలగు ప్రజాసమూహముల గుమిగూర్చినది. కాని యీప్రజావళియంతయు దుఃఖపూరితమై చేతగర్రనైనధరింపక పాదరక్షల శిరోవేష్టములసహితము విసర్జించినవారై డిప్టీకమీషనరుగారి బంగాళాకడకుపోయి తమనాయకుల విడిపింపుమని ప్రార్థింపబయనమైరి. మార్గమధ్యమున రైల్వేవంతెనకలదు. వారికడ్డముగా సైనికులునిలచి వీరినిపోనిచ్చిరికారు. ప్రజలెంత బ్రతిమాలినను లాభములేకపోయినది. అంతలో బ్రజలలో నాతురతవలన ద్రోపులాటకల్గినది. అది సైనికులకును గొంచెము సంక్రమించి



నది. ఇఁకనదియంతయు బ్రతిఘటనమని భ్రమించి సైనికులెల్లరు తుపాకులు బారుచేసి కొంతమందినిజంపి కొంతమందిని గాయపఱచిరి. ప్రజలువెనుకకుమరలిరి. చచ్చినశవములనుక్షతగాత్రులను మోసుకొనుచు ప్రజలుపోవుటలో మఱికొందఱు గుమిగూడి పూర్వశాంతము విసర్జించుకొని కోపోద్రేకముతో రాళ్ళురప్పలు కర్రలుసంగ్రహించి మరల వంతెనకేసి పరువులెత్తిరి. ఇంతలో ప్లీడర్లు కొందఱు వచ్చి శాంతిపఱుప ప్రయత్నించుచునేయుండిరి. పోలీసువారును దయచేసిరి. మిలిటరీకూడ సమీపముననే యున్నది. శాంతిపఱచుటలో జాలవఱకు గృతకృత్యులగుచుండగనే యెవరో రాళ్ళురువ్విరను సాకుతో తుపాకులు పేల్చి యిరువదిమందిని జంపి చాలమందిగాయపరచిరి. ఇక పట్టపగ్గములు లేకపోయి ప్రజాసమూహములు బ్యాంకులలోనికి టౌనుహాలులోనికి పోష్టాఫీసు రైలుస్టేషనుకిబోయి భవనముల దగులబెట్టి దొరల సంహరించి గగ్గోలుచేసి కసిదీర్చుకొని సాయంకాలమైదు గంటలకు ప్రజలెక్కడివారక్కడకు బోయిరి. ఆరాత్రియే ప్రభుత్వవర్గము వారిని సమావేశమై సైనికాధికారులకు పట్టణమప్పగించివైచిరి. జనరలు డయ్యరు ప్రవేశించెను. మహాక్షోభమునకు ప్రారంభమైనది. 13 న తేదీని మరల జలియన్వాలాబాగులో లాలా కన్యాలాలు అనుశతవృద్ధు ఆధిపత్యమున ప్రజాసభ జరుగునని

హంసరాజను మాయవిభీషణుడు అధికారుల ప్రోద్బలమున బ్రకటించెను. ఆయుదయమే డయరేమో మీటింగులు జరుగగూడదు మొదలగు సైనికాజ్ఞల బ్రకటింపించెనట. అదియెవ్వరి కీడెలియక పోవుటచేతను ఆరోజు సంవత్సరాది యాటవలనను చుట్టుపట్టులనున్న గ్రామములవారు సహితము స్త్రీపురుషాదులెల్లరు ఆజలియన్వాలాబాగులోచేరిరి. ప్రజానాయకులెవ్వరోవచ్చి తమ హితవును జెప్పెదరని పేరాసతోనున్న బ్రజలకు హంసరాజీయేమో చెప్పుచున్నాడు. అంతట జనరలు డయ్యరు తన సైన్యముతో ప్రత్యక్షమై యాతోట మార్గములన్నిటి నాక్రమించి యేవిధమైన సంజ్ఞాపనమైన లేకుండ నాయిరువదివేల ప్రజలపైని మందుగుండు సామానున్నంతవరకు తుపాకులు పేల్పించి పారిపోకుండ గూడ మహామారణకర్మమొనర్చి నల్గురుదొరలు చచ్చిన హేతువునకు పండ్రెండువందల శవముల గన్నులారజూచి కృతకృత్యుడై మరలెను. మొత్తము 1560 గుండ్లుపేల్చబడిన యిరువదివేల ప్రజలలో నెందరు చచ్చియుందురో యెందరుగాయపడి జీవితశేషము వ్యర్థలై నిరంతర దుఃఖములపాలైరో యూహింపనేవచ్చును.

వెంటనే పంజాబులో నైదుజిల్లాలలో సాంగ్రామికశాసనము ప్రకటింపబడెను. మిలిటరీకోర్టులుపెట్టి రాజుపై యుద్ధమొనర్చిరను నభియోగములు తెచ్చి వేలకొలది ప్రజలబాధిం



పజొచ్చిరి. ఈచిత్రవధలు ఈఘోరదురంతములు నోటనుచ్చరింపరానివై యున్నవి. ఒకసందులోనడుచుట పొట్టపై ప్రాకుటయే! సలామొనర్పనివారిని కోణాలగట్టి కొరడాలతో బాదుటయే! యిండ్లలోదూరి యువతీమణుల నానావమానముల పాలు చేయుటయే. పసిపిల్లలుసహితము రాజుపై దండెత్తిన నేరమున కురిదీయుటయే. తప్పుసాక్ష్యము చెప్పించుటకు పుష్టములలో దుమ్ముగొయ్యలుకొట్టుటయే. వ్రేళ్ళపై నుంచపుగోళ్ళమోపిద్రొక్కించుటయే! ఇట్లు ఓడియరు ప్రభుత్వము త్రిలోకకంటకమైనది. రాజప్రతినిధిగానున్న ఛలమ్సఫర్డుదొర వీనినన్నిటినివిని యూరకొనగల్గెను. ప్రపంచమందంతయు నీపంజాబు ఘోరములువిని ఛీఛీ యింతకంటె నమానుషప్రక్రియ యుండబోదని బ్రివ్వాదిట్టిరి. ఇంగ్లాండులో గొన్నిపత్రికలుకూడ దీవ్రముగఖండింపనారంభించినవి. కాని యిండియాద్రవ్యముదిని మైమరచిన యధికారవర్గపుదొరలుమాత్రము తమరాజ్యమును నిలబెట్టగల్గి నందులకు డయ్యరుసేనానికి బంగారుకత్తి బహుమతియొసగిరి. పార్లమెంటుచే నేర్పాటుచేయబడిన హంటరువిచారణసంఘము డయ్యరుసేనాని యీకృత్యముకొంచెము పొరపాటనిమాత్రి మనగల్గినది. కాంగ్రెసు కమిటీ విచారణసంఘమునుపంపి రహస్యములు బైటబెట్టించినది. ఈగోలయిట్లుండగనే పార్లమెంటులో సంస్కరణచట్టము ప్రవేశపెట్టబడి తీర్మా

నింపబడినది. మితవాదులు చంకలెగురవేయఁ దొడంగిరి- జాతీయవాదులెల్లరు సంస్కరణములుపట్టి బూటకములు నిరర్థకములుకూడ గాగలవని తృణీకరించుచుండిరి. ఈతరుణముననే అమృతసరులో డిశంబరు 1919 సంవత్సరాంతమున పండిత మోతీలాలునెహ్రూ సభాధిపత్యమున కాంగ్రెస్సు సమావేశమయినది. ఇట్టివన్నిటికి మూలకారణుడైన రాజప్రతినిధిపై అసమ్మతితీర్మానము గావింపబడినవి. సంస్కరణములుగూర్చి గొప్పచర్యజరిగి తుదకు యథోచితసహకారానుగుణముగ తిలక్భగవానుని రాజీతో తీర్మానింపబడినది. ప్రతినిధులెల్లరు పంజాబు దురంతములగూర్చి యుద్రేకించిన కోపోద్దీపితులయ్యు గాంధీమహాత్ముని పట్టుదలమీద డయ్యరు ఓడయరుల యుద్యోగములతీసివేసి పెన్షనులుమాన్పించిన జాలునని తీర్మానించిరి. ఇట్టియుద్రేక పూరితములగు మరికొన్ని తీర్మానములలతో సభముగిసినది. 1920 సంవత్సరప్రారంభముననే పార్లమెంటులో జలియన్వాలా చర్చజరిగి కాంగ్రెసుకోరిక నెరవేర్పబడక డయ్యరోడయరులకు నుద్యోగములుమాత్రము తీసివేసి పెన్షనులు ముట్టునట్లే యొప్పుకొనుటయు వారిచర్యలు కొంచెము పొరపాటు అని మాత్రము మందలించుటయు అప్పటికి సివర్సుసంధిమూలముగ టర్కీరాజ్య మపహరింపబడి మహమ్మదీయుల కాలిఫానుదొలగించి ఖిలాఫత్ నిర్మూలించి తురకల



దేవాలయములకు దామేపూజారుల మగుదుమనునట్లు ఇంగ్లీషువారు ప్రవర్తించుటయు దేశములో మరల గొప్పపరివర్తనమునకు గారణమై హిందూముసల్మానులేకీభవించి గాంధీమహాత్ముని నాయకత్వమున దౌర్జన్యరహిత సహాయనిరాకరణోద్యమము ప్రారంభింపబడినది. గాంధీమహాత్ముని కోరికపై 1920 సెప్టెంబరులో కలకత్తాలో లజపత్రాయి సభాధ్యక్షత క్రింద నవసరకాంగ్రెస్సు జరిగి విశేషచర్చానంతరము దౌర్జన్యరహిత సహాయనిరాకరణ తీర్మాన మంగీకరింపబడినది- శాసనసభా బహిష్కారము. న్యాయస్థానబహిష్కరణము, బిరుదుల విసర్జనము, విందులదూరీకరణము, ఖద్దరుధారణము, రాట్నము స్వదేశీ, బ్రిటిషువస్తు బహిష్కరణము మొదలగు పనులతో ప్రజలెల్లరు ప్రభుత్వమిదివఱ కొనర్చుచువచ్చిన సహాయము నిరాకరించుటయు తుదకు దౌర్జన్యరహితము శాసనోల్లంఘనము పనులనిరాకరణముచేసి స్వరాజ్యప్రతిష్ఠాపన మొనర్చుకొనవలెనని యాతీర్మానముయొక్క ముఖ్యాశయము. ఇందులకు స్వార్థత్యాగము నిర్భయత్వము, అహింస ప్రేమోల్లసనముకల యువకులు సంసిద్ధపడవలెననియు నిట్లు దేశమంతయు దౌర్జన్యరాహిత్యమై పైతీర్మానము నడిపించినయెడల నొకవత్సరములోపల స్వరాజ్యము తెత్తునని మహాత్ము డుద్ఘోషించెను. ఈతీర్మాన మనుసరించియే గొప్పప్రబోధముజరిగి యాసంవ

త్సరపు టెన్నికలలో నొకవోటరును పాల్గొనకుండ జయప్రదముగ సహాయనిరాకరణము సాగించిరి.

ఈ విజయోత్సాహముతో నాగపూరులో డిశంబరు 1920సంవత్సరమున సేలమువిజయరాఘవాచారిగారి సభాధిపత్యమున గొప్పకాంగ్రెస్సు జరిగినది. ఇంతసమావేశము లోకములో భూగోళము పుట్టినతరువాత నేకాశయబద్ధమై జరుగలేదని యద్దాని దర్శింపవచ్చిన వెన్స్వూడు మొదలగు పార్లమెంటు సభ్యులు దుర్భరాశ్చర్యమొందిరి. 12 వేలమంది ప్రతినిధులు ముప్పదివేలమంది ప్రేక్షకులతో సభాసమావేశమగుటయు నయ్యదంతయు నొక్క గాంధీమహాత్ముని కనుసన్నల నొగ్గి మెలంగుటయు జూచిన హిందూదేశమున నెంతటి స్వారాజ్యకాంక్ష ప్రబలియున్నదో గ్రహింపనగును. ఈసభావేదికపైనే కాంగ్రెస్సు ముఖ్యాశయము శాంతిపద్ధతులపై స్వారాజ్యము సంపాదించుటయని నిర్వచింపబడినది. దౌర్జన్యరహిత సహాయనిరాకరణము నేకగ్రీవముగ నన్నిపక్షములవారు సంగీకరించిరి. ఇంతటితో గాంగ్రెస్సునకు బ్రభుత్వమును బ్రార్థించుట కోరుట మొదలగు తీర్మానములుపోయి ప్రజలుతమలో దామెట్లు ప్రవర్తింపవలెనో యెట్టిపద్ధతులమీద స్వారాజ్యము ప్రతిష్ఠించుకొన సాధ్యమగునో నిర్వచించుకొని యందులకాచరణకు దిగుటయను మహాపరిణామము తటస్థించినది. ఈతీ



ర్మానము నాచరించినయెడల స్వారాజ్యమొక్క సంవత్సరములోవచ్చి తీరునని మహాత్ముడు మరలనుద్ఘోషించినాడు. ఇంతటినుండి మహాత్ముడు అవతారపురుషుడై లోకనాయకుడై ప్రకాశింప మొదలిడెను. ఆసేతు హిమాచలమొక్క సారి యీమహోద్యమములో నావేశపూరితులై ప్రజలు పాల్గొనసాగిరి.

మహాత్ముని యాదేశానుసారము విదేశవస్త్రములు దేశమెల్లెడల పర్వతములవలె ప్రోగుచేసి దహనసంస్కారమొనర్చివైచిరి. సిల్కులలోను సున్నితవస్త్రములలోను మెలగునాగరిక శ్రీమంతులెల్లరు ముదుకగుఖద్దరు గుడ్డలధరించి పవిత్రులుకాజొచ్చిరి. ప్రతియింట రాట్నములు వెలయమొదలిడినవి. వేలకొలదిస్కూలుపిల్లలు యింగ్లీషు విద్యాలయములు బహిష్కరించి మహోద్యమములో బాల్గొనబ్రారంభించిరి. వేలకువేలు ప్లీడర్లు న్యాయవాదవృత్తులు మానుకొని మహోద్యమావేశములో విలీనము కాగడంగిరి. జాతీయవిద్యాప్రతిష్ఠాపనలు మొదలిడినవి. మాలమాదిగల యస్పృశ్యత యంతరించినది. దేశమునకువచ్చిన యువరాజుల నాగమనము బహిష్కరింపబడి యెల్లెడల జయప్రదముగ హర్తాలుజరుగగల్గినది. కోటిరూప్యములు, కోటిమందిసభ్యులు నలుబదిలక్షల రాట్నములు నెలకొల్పబడినవి. స్వారాజ్యలక్ష్మికి పునరుద్ధరణ ప్రయత్నము

లలో సామోపాయమున దౌర్జన్యరహితమైన స్వరాజ్యయుద్ధమిదియేయని చరిత్రకారులు ప్రపంచకము సన్నెఱతో దిలకింపజొచ్చిరి. బ్రిటిషు సామ్రాజ్యమంతయు గబగబవడంకినది. రీడింగుప్రభువు రెండుమూడుసారులు రాజీమార్గములకై కొట్టుమిట్లాడెను, హిందూముసల్మానులు లేకమైపోయిరి. దేశమంతయు నుప్పొంగి యాకాశమార్గమున బహువేగమున దాండవించుచున్నది. ప్రభుత్వమువారలెంత ప్రయత్నించి మితవాద జస్టిసుపక్షములజేపట్టి యుసికొల్పి సహాకారోద్యమముబయల్దేరదీయ బ్రయత్నించిన గొనసాగలేదు. కోర్టులలో ఫైలులేదు, కాలేజీలలో బిల్లలులేరు. ఉపాధ్యాయులునుదక్కువైనారు, బ్రిటిషుమర్యాద గౌరవము నేలపాలైనవి. స్వరాజ్యలక్ష్మి కరుణోదయమైనట్లుత్సాహ వంతులెల్లరకు బొడగట్టినది. త్రాగుడు మాన్పుటలు, జెండాలెత్తుటలు, తండోపతండములుగ నుపన్యాసకులు బయల్దేరి గ్రామములన్నియు ప్రబోధముగావించుటలు. లక్షోపలక్షలు ప్రజలుమూగి గాంధీ యుద్యమముగూర్చిన సమాచారము లాలకించుటతో దేశమంతయు జగజ్జేగీయమానమైపోయినది. ప్రభుత్వమింక నూరకొనలేక నిర్బంధవిధానము ప్రారంభించిరి. వేలకువేలు కారాగారములకు పెండ్లికొడుకులవలె నడువజొచ్చిరి. ప్రాణార్పణమైన వెనుదీయని ధైర్యముతో సహింసా శృంఖలాబద్ధులై ప్రజలెల్లరు సమిష్టిశాస



నోల్లంఘనమునకై యువ్విళ్ళూరుచున్నారు. ఆంధ్రదేశమున వంగదేశమున గుజరాతులో నెల్లయెడల గొన్నిప్రదేశములు సమిష్టి శాసనోల్లంఘనమునకు పన్నులనిరాకరణమునకు బ్రత్యేకింపబడి తయారుచేయబడుచున్నవి. ఈతరుణమున వేనవేలు నాయకులు కారాగారములలోనికి బరువెత్తుచున్నారు. చిన్నయనక పెద్దయనక ప్రభుత్వపు రోషానలములకింధనములై ప్రతివాదములైన బెట్టుకొనకుండ ధిక్కరించి కారాగారముల నింపుచున్నారు. ఈతరుణముననే అహమ్మదాబాదులో 1921 సం॥ డిశంబరు మాసాంతమున సి. ఆర్ దాసు సభాధిపత్యమున జరుగవలసిన కాంగ్రెస్సు దాసు కారాగారబద్ధుడగుటచే హకీము అజ్మల్‌ఖానుతో జరిగినది. గాంధీమహాత్ముడు పిబ్రేవరిలో బర్డోలీలో శాసనోల్లంఘనము ప్రారంభింతునని ప్రకటించి రీడింగుప్రభువునకు ఆఖరుసందేశము కూడనంపెను. దేశమంతయు నఱ్ఱులెత్తి భగవత్ప్రార్థనము నొనర్చుచు మహాతురతతో బ్రతీక్షించుచుండిరి. స్వరాజ్యలక్ష్మి యికరెండు మూడు దినములలో మరలహిందూదేశము ద్రొక్కగలదని పేరాసతో భారతమాత చూచుచున్నది. ఇంతవఱకు శాంతియుతమై దౌర్జన్యరహితమై యర్హమైన పరిస్థితులలోనున్న హిందూదేశము కాలవశమున నొకమూల చౌరీచౌరాలో కొన్ని దురంతములు కాంగ్రెస్సు సభ్యులచేతనే చేయబడినవని తెలియవచ్చుటచే

గాంధీమహాత్మునికి దివ్యసందర్శనమై యింతయుద్యమము నొక్కసారిగా "ఆగు" మని కేకవైచి నిలిపివైచెను. దేశమొక్క దెబ్బలో నాశాభంగమై స్తంభీభూతమైపోయినది. గాఢాంధకార బంధురమైన దురవస్థమరల ప్రారంభమైనది. గాంధీ కారాగారబద్ధుడు కాబడెను. నాయకులెల్లరు కారాగారములలంకరించిరి. దేశములో నాయకుడు పరిచారకుడు నిర్వురుకూడ లేరు. నిరుత్సాహము, నిర్వేదముమాత్రము మిగిలినది.

పునరుద్ధరణ ప్రయత్నమీతీరున నిప్పటికి తుదముట్టినది.



# ఉపసంహారము



సహాయనిరాకరణోద్యమ మాతీరున నుపసంహరింపబడినతరువాత తక్కుంగల నాయకులెల్లరు కారాగార ప్రవేశ మొనర్చి తమవిధినితాము నిర్వర్తించుకొని యున్నకుండవలసి వచ్చినది. అకస్మాత్తుగానంతయు మహోద్యమ మాపుచేయబడినందువలన గొంతనిస్తబ్ధత దేశమున కానరించుటయేగాక నాయకవినాయకులం దెడతెగని వివాదలుప్రబలి దేశముమ రింత యధోగతికి పోజూచినది. 1922 సంవత్సరాంతమున గయలో చిత్తరంజనుని యాధిపత్యమున 37 వ కాంగ్రెస్సమావేశముజరిగినది. ఈసమావేశమునసే చిత్తరంజనదాసు యెట్లయిన దేశములో నైకీభూతమైన యుద్యమప్రణాళిక నవలంబింప విశ్వప్రయత్న మొనర్చెను. కాని రాజగోపాలచారి మొదలగు గాంధీమహాత్ముని శిష్యకోటి పడనీయక వెనుకటితీర్మానము నేపట్టి ప్రేలాడుదుమని కాంగ్రెస్సులో చీలికకల్గునట్లుచేసిరి. అప్పటికి ఖైదునుండి బైటబడిన నాయకులెల్లరు స్వరాజ్యపక్షమని యొకపక్షము నిర్మించుకొని ప్రయత్నింపవలసివచ్చినది. కౌన్సిళ్ళలోనికి బ్రవేశించి ప్రతిఘటన మొనర్చవలెనని వీరెంతయో ప్రయత్నించిరి. అప్పుడదరుదెంచిన యెన్నికలలో జాలచోట్లస్వరాజ్యపక్షమువారుజయమందగల్గికొంతపనిచేయగల్గిరి.

1923 వ సంత్సరాంతమున మొదటిసారి నాంధ్రదేశమునకు జయప్రదముగ మౌలానా మహమ్మదాలీగారి యాధిపత్యమున 38 వ కాంగ్రెస్సు సమావేశింపబడి కాంగ్రెస్సులో బయల్దేరిన యుభయపక్షములకు రాజీప్రయత్నములు విరివిగ జరిగినవి. కాని యంతగా సాఫల్యము చేకూరలేదు. దీనితరువాతనే గాంధీమహాత్మునకు కారాగారమున గొప్పజబ్బుచేయుటయు ప్రభుత్వమువారు శస్త్రచికిత్స యొనర్చి మహాత్ముని విడుదలచేయుటయు జరిగినవి. ఇప్పటికి మొత్తముమీద నాయకులెల్లరు ఖైదులనుండి విచ్చేసిరి. కాని దేశమునంతయు నేకాగ్రముగా నడిపించగల శక్తికాని, ప్రణాళికగాని, యెంతమాత్రము పొడగట్టలేదు. గాంధీమహాత్ముడు బైటబడినను ఖద్దరొక్కదానితోనే తాను తృప్తిపడి క్రమక్రమముగా రాజకీయరంగమంతయు నెహ్రూప్రభృతులగు స్వరాజ్యపక్షమువారికప్పజెప్పుటకు సంసిద్ధుడయ్యెను. 1924 సంవత్సరాంతమున బెల్గాములో 39 వ కాంగ్రెస్సు గాంధీమహాత్ముని యాధిపత్యముననే సమావేశమైనది. కాని యుత్సాహము పురికొల్పదగిన యంశమేదియు నందుపొడగట్ట గల్గినదికాదు. అప్పటికున్న స్వరాజ్యపక్షమువారి కౌన్సిలు ఆర్భాటములే యప్పటికి శ్రోతవ్యములై యుండెడివి. 1925 సంవత్సరాంతమున, కాన్పూరులో 40 వ కాంగ్రెస్సు శ్రీమతి సరోజనీదేవి యాధిప



త్యమున జరిగిపోయినది. 1926 సంవత్సరమున గౌహతిలో 41 వ కాంగ్రెస్సు శ్రీమాన్ శ్రీనివాసయ్యంగారి యాధిపత్యమునను జరిగినది. కాని యీసంవత్సరములన్నియు దేశమునకు గొప్పవిషాద కారణములైన పరిస్థితులతో నడిచినవి. చిత్తరంజనుడు చనిపోవుటయు, శ్రద్ధానందస్వామి యొకతురకచేత కాల్చి చంపబడుటయు దేశములో నెల్లెడల హిందూముసల్మానులు ఘోరముగ నన్యోన్యమారణ కర్మములందు దగుల్కొని స్వరాజ్యసమస్య విస్మరించుటయు జరిగినవి. గాంధిమహాత్ముడు తుదకు హిందూమస్లీము సఖ్యతగురించికూడ నిరాశచెందినవాడై జోక్యము కలుగజేసికొనుటమాని తనఖద్దరు ప్రచారమాత్రమున తూష్ణీంభావుడయ్యెను. నాయకులలోనే బ్రహ్మాండములైన వివాదలు బయల్దేరినవి. బ్రిటిషుప్రభుత్వమువారు మరల హాయిగ నూపిరివీల్చుకొని హిందూదేశము గూర్చిన యాందోళన ముపశమించుకొని తమపడకకుర్చీలపై సుఖాసీనులు కాజొచ్చిరి. స్వరాజ్యపక్షమువారెంత దీక్షతో బ్రయత్నించినను శాసనసభలలో గొన్నితీర్మానములుమాత్రమే చేయగల్గి మిగతాప్రతిష్టంభనాదికములో నర్పజాలకపోయిరి. వివిధపక్షముల కక్షలేకారణముగా దేశములోనేపనియు జరుగనేరదని బ్రిటిషుప్రభుత్వము పూర్తిగా గ్రహించినది. సామ్రాజ్య శాసనసభలో మూడుసారులు

ప్రజాసభ్యులెల్లరు నేకగ్రీవముగా తీర్మానించిన నేషనల్ డిమాండనబడు కనీసపుకోర్కి సహితము ప్రభుత్వమువారు తృణీకరింపగల్గిరి. దేశములోనున్న హిందూమస్లీముల దురాగతములు దక్షిణమున పెచ్చుపెరిగియున్న బ్రాహ్మణేతరోద్యమము మరికొన్ని స్వార్థపూరణ పక్షములు ప్రభుత్వమునకు ధైర్యముగొల్పి దేశములోగల మితవాదాగ్రణులగూడ తూలనాడి యవమానకరమని యెంచబడిన రాయల్ కమీషన్ పంపుదుమని ప్రకటించినది. ఇందుతో దైవవశమున మితవాదులు, స్వతంత్రులు, మస్లీములు కాంగ్రెస్సుతో సమీకరించి యాకమీషన్ బహిష్కరింప వలసినదను తీవ్రసంకల్పమొనర్చిన సమయముననే 1927 సంవత్సరాంతమున మెడ్రాసులో అన్సారీ యాధిపత్యమున 42 వసారి కాంగ్రెస్సు సమావేశింపబడినది. ఈ కాంగ్రెస్సులో ముఖ్యముగా హిందూమస్లీముల సఖ్యతకై చేసిన తీర్మానమును, స్వతంత్రమే హిందూదేశమునకు పరమావధియని నిర్ణయించు తీర్మానమును మిక్కిలి గణనార్హములై యున్నవి. ఇప్పటికి, కాంగ్రెస్సు నిర్భయముగా బ్రిటిషుప్రభుత్వముతో దమపరమావధి సంపూర్ణ స్వాతంత్ర్యమని నిరూపించుటకు సాహసించుటలోననే, ప్రజానమూహమందుగల స్వరాజ్యకాంక్ష యెంతనైశిత్యమైయున్నదో తెలియగలదు. ఇట్లు భారతస్వరాజ్యయుద్ధము క్రమక్రమముగ



నెట్టిపరిణామములొంది యెట్లుజర్గింపబడుచు వచ్చినదో చూచియున్నాము. పదివేల సంవత్సరములు సంపూర్ణస్వరాజ్యమనుభవించి క్రమక్రమముగా గ్రీకులు, పఠానులు, మొగలులు బ్రిటిషువారలు, మొదలగువారలవశమై యెప్పటికప్పుడు దేశభక్తులచే యావచ్ఛక్తితో బ్రతిఘటింపబడుచు, 1857 సంవత్సరమువఱకును దండోపాయమునే యనుసరించినను కాలపరిస్థితుల ననుసరించి శాస్త్రీయ పద్ధతులు, శాంతపద్ధతులు, దౌర్జన్యరహిత పద్ధతులుమాత్రమే నేటికవలంబించి నేటికి, నాభారతస్వరాజ్యయుద్ధమే కొనసాగింపబడుచున్నదని మనము స్పష్టముగా చారిత్రికముగా నిరూపించుకొనియున్నాము. ఇఁకనీ యుద్ధమునెట్లు భగవంతుడు నడిపించి భారతమాత నుద్ధరింపనున్నాడో భావికాలగర్భమునందే యిమిడియున్నది. భగవత్కటాక్షమున బ్రిటిషుప్రజలకును భారతీయులకును సంతోషకారణముగ నుభయులకు మనస్సులుకుదిరి యీస్వరాజ్యయుద్ధము దౌర్జన్యరహితముగనే సాంతమై భారతస్వరాజ్య ప్రతిష్ఠాపనముతో బరిసమాప్తి యగుగాత మను ప్రార్థనముతో ఈపొత్తమిప్పటికి విరమింపబడుచున్నది.



# తప్పొప్పుల పట్టి.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 6 | మిత్రులు | మిశ్రులు |
| 6 | 10 | నెట్టి | నట్టి |
| 14 | 20 | resolu | revolu |
| 16 | 5 | మన దేశ | తమ దేశ |
| ,, | 15 | శుశ్రూత | శుశ్రూష |
| 23 | 1 | పరీక్షించవలసిన | పరీక్షించి,వలసిన |
| 24 | 4 | జేబిల్ | జేబిల్క |
| 25 | 6 | నధికాము | నధికారము |
| 29 | 5 | యాధారపప్రము | యశోధారావ్రతము |
| ,, | 9 | ప్రజాస్వామికముకై | ప్రజాస్వామికములై |
| 31 | 1 | సౌఖ్యత | సౌజన్యత |
| 41 | 1 | నిరననము...విషయమై | (తీసివేయవలెను) |
| 43 | 3 | ఆయడన్నం | ఆయురన్నం |
| ,, | 5 | ఛించి | పెంచి |
| 44 | 14 | శుశ్రూత | శుశ్రూష |
| ,, | 17 | పదిక్రాంత | పరిక్రాంతి |
| ,, | 20 | మతాచార్య | మధ్వాచార్య |
| ,, | ,, | ప్రపత్తులో | ప్రపత్తులు |



| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 45 | 1 | యపేతూ | యుపేతూ |
| 47 | 7 | శరణత్రియ | శరణంవ్రజ |
| 48 | 2 | ధనంబులు | ధనంజయ |
| ,, | 8 | బురోగమన | యధోగమన |
| 49 | 19 | లేవకాలము | వేదకాలము |
| 54 | 14 | మహాభిని | మతాభిని |
| ,, | 17 | సాలించిన | పాతించిన |
| 55 | 17 | ప్రాసియున్న | ప్రాకియున్న |
| 69 | 1 | చూచియా | జాజియా |
| ,, | 3 | రాజుతోదర్మాలు | రాజాతోడర్మాలు |
| 77 | 19 | Oppression | Oppressor |
| 78 | 8 | జారత్వ | జాతిత్వ |
| 83 | 10 | వన్నె | వన్నీ |
| 85 | 13 | యదివతుకె | యదివలుకె |
| 89 | 20 | రాజమ్యంచే | రాజ్యమండే |
| 112 | 9 | వహింపక | సహింపక |

## 'పల్లెటూరు గ్రంథమండలి'



మహారాజపోషకులు.

1 శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, చెన్నపట్నం.

2 నడింపల్లి సుబ్బరాజుగారు, కోడూరుపాడు.

3 జాజాల చలమయ్యశాస్త్రిగారు, రాజమండ్రి.

4 బచ్చు సత్యనారాయణమూర్తిగారు కూనవరం.

రాజపోషకులు.

5 జంపన సుబ్బరాజుగారు, ప్రొప్రయిటరు, ఖండవల్లి.

6 పల్ల సూర్యనారాయణగారు, వకీలు, కొవ్వూరు.

7 దామోజీపురపు సత్యాధిరావుగారు, వకీలు, కొవ్వూరు.

8 బలిజేపల్లి సుబ్రహ్మణ్యంగారు, వకీలు, తణుకు.

9 కలిదిండి గంగరాజుగారు, తాడేపల్లిగూడెం.



10 రామానుజం రాఘవ రామారావుగారు, రాజమండ్రి.

11 గొట్టుముక్కల సుబ్బరాజుగారు, తాడేపల్లిగూడెం.

ప్రధానపోషకులు.

తల్లాప్రగడ కామేశ్వరరావుగారు, ఉంగుటూరు.

13 తల్లాప్రగడ భీమేశ్వరరావుగారు, ఉంగుటూరు

డాక్టరు, జీడిగుంట కామరాజుగారు, నిడదవోలు.

డాక్టరు, సత్తిరాజు వెంకట్రావుగారు, అత్తిలి.

16 [illegible]వుడు శివరావుగారు, కొవ్వూరు.

17 మల్లంపల్లి మల్లిఖార్జునరావుగారు, కొత్తపల్లి అగ్రహారం.

18 చేడ నారాయణమూర్తిగారు, తొండంగి.

19 ముళ్ళపూడి తిమ్మరాజుగారు, తణుకు.

20 పులవర్తి లక్ష్మణస్వామిగారు, ఆకివీడు.

21 పసల సోమయ్యగారు, తాడేపల్లిగూడెం.

వులపల్లి రామమూర్తిశాస్త్రిగారు,
అగ్రహారందారు, తిమ్మరాజుపాలెం.

23 విష్ణువఝుల లక్ష్మీనారాయణగారు,
చిలకలంపాడు.

పోషకులు.

24 గంధం వెంకయ్యనాయుడుగారు,
వకీలు, భీమవరం.

25 బొడ్డుపల్లి లక్ష్మీనారాయణగారు,
కొవ్వూరు.

26 డాక్టరు, యర్రమిల్లి దీక్షితులుగారు,
నిడదవోలు.

27 ఆచంట క్రిష్ణమూర్తిగారు,
మాధవరం.

28 డాక్టరు, నజీరు అహ్మదుగారు,
తాడేపల్లిగూడెం.

29 కరారి అచ్యుతరామరాజుగారు,
ఒడ్డూరు.

30 రేకపల్లి వఝులుగారు,
వకీలు, రాజమండ్రి.

కలి 31 గాడవర్తి నాగేశ్వరరావుగారు,
ఆచంట.

32 బొళ్ళ వెంకటరత్నంగారు,
పెదపట్నమగ్రహారం.

33 తుమ్మలపల్లి సత్యనారాయణగారు, పిప్పర.

